

# హరదత్త విజయము

శతావధానులు బ్రహ్మశ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారిచే
పరిష్కృతము.

రచయిత

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి

1953



వెల రూ॥ 2—0—0

శ్రీ శివాభ్యాన్నమః

# విజ్ఞప్తి.

"భగవత్సేవకన్న భాగవతసేవ కోటిరెట్లధికసుఖము" అనెడు లోకోక్తి ననుసరించి శ్రీశ్రీశ్రీ లోకారాధ్యులును శైవాచార్య పట్టభద్రులునగు హరదత్త శివాచార్యులవారి విజయచరిత్రంబుఁ దెలుఁగునుడుల విరచించి తమ సముఖమున నిడుచున్నాఁడను. నేఁ జిఱుతనాఁడు పాఠశాలలోఁ జదువునపుడు మామకవైయాకరణగురులగు బ్రహ్మశ్రీ చిట్టాపూరి సీతారామశాస్త్రులవారొకనాఁడేదో ప్రస్తావనావశంబున నీ హరదత్త శివాచార్య చరిత్రంబు సాకల్యంబుగ నుపన్యసించిరి. తదాదిగ నాకీయాచార్యచరిత్రంబునందు నామోద ముద్భవిల్లి యన్వేషింపఁగా నివ్వారస్మదీయ శైవమతమూలాచార్యులగు ద్వాదశాచార్యులలో నొక ప్రధానాచార్యులుగఁ దేటపడుటయే కాక యస్మదీయాన్వయకూటస్థపురుషుఁడు శ్రీశ్రీ మంత్రారాధ్యునిచే రచింపఁబడిన చిన్నగ్రంధ మార్యాత్మకమొండు లభించినది. అపుడింకను ద్విగుణీకృతోత్సాహుఁడనై వీరి చరిత్రంబు స్వభాషలో రచించినఁ గృతార్థుఁడ నగుదు నని భావించితిని. ఈభావన చాలకాల ముదరగతమై జీర్ణప్రాయముగ నుండి నేటికి మూఁడువత్సరముల క్రిందఁ గ్రియారూపంబున నుద్భిన్నమై యిపుడీరూపంబున నిష్పన్నంబై ప్రకటింపఁబడినది. కావున నిద్దానిఁగూర్చియు హరదత్త దేశికేంద్రునిఁగూర్చియు నించుక వ్రాసెదను.

హరదత్తగురుఁడు చెంగల్పట్టు జిల్లాలోని శ్రీకాంచీ దివ్యక్షేత్రమందొక బ్రాహ్మణ వైష్ణవ వితంతువునకు శివానుగ్రహంబున జన్మించి శివానుగ్రహంబుననే చిఱుతప్రాయంబున నుపనయన శైవదీక్షలను వేద శాస్త్ర పాండిత్యగరిమంబును వాదశక్తినిఁ జెంది కాంచీపురంబున నొక తరమునుండి శైవమతంబును బాసి వైష్ణవదీక్షను జెందినట్టిశైవకులోత్తుంగ చోళభూపాలుని యాస్థానంబునఁ బాంచరాత్రపండితులను వాదంబందు జయించి యంతఁదనియక నిదర్శనమునకై శ్రీమదేకామ్రేశ్వరాలయ గోపురంబునఁ దప్తలోహనిశ్శ్రేణి నధిరోహించి చోళరాజును మరల శైవదీక్షితునిఁ గావించి ప్రపంచమందు శైవమతవిజయంబు విఖ్యాతం

బొనరించె నసునది వస్తురూపము. ఇద్దానిని నేను విపులీకరించి వ్రాసితిని. ఇందు హరదత్తుని తలిదండ్రులయొక్కయు మాతామహాదులయొక్కయు నామధేయంబులు కల్పితములు. తక్కినచరిత్రంబంతయు సాంప్రదాయ శ్రుతమును శైవాచార్యవిజయగ్రంథసంపాదితమునై యున్నది. ఇకను గొన్ని యేండ్లకింద మదరాసు విశ్వవిద్యాలయమందలి ప్రొఫెసర్ శ్రీ S. S. సూర్యనారాయణశాస్త్రి, M. A. రీడరుగారు హరద త్తశివాచార్యుని గుఱించి యొక యుపన్యాసంబును గోరకపురిప్రచురితశ్రీశివాంక గ్రంథమందుఁ బ్రకటించిరి. అందు హరదత్తునిజన్మగ్రామము తంజావూరు జిల్లాలోని కంసపురంబనియు అం దగ్నీశ సన్నిధానమందు నిజమహిమంబుల హరదత్తుఁడు చూపెననియు తలిదండ్రులు పరిత్యక్తవైష్ణవమతుం డగుసుతునిఁ గుఱించి విచారపడిరనియు వారువ్రాసిరి. నాయీకథకును నద్దానికిఁ గొంచెము వ్యత్యాసమున్నను గథానాయకుఁడుమాత్రము తప్తనిశ్శ్రేణ్యధిరోహణము శ్రీచతుర్వేదతాత్పర్యసంగ్రహగ్రంథకర్తృత్వము మున్నగువానిచే నొక్కఁడుగనే యున్నాఁడు. ఇఁకఁ జారిత్రపరిశోధకాగ్రణులును అస్మాకీనసతీర్థ్యజ్యేష్ఠులును విద్వత్కవివరేణ్యులునగుకీ॥ శే॥ బ్రహ్మశ్రీ వేటూరిప్రభాకరశాస్త్రిలవారు నాయభ్యర్థనంబున హరదత్తచరిత్రం బొకచిన్నకాగితమందు వ్రాసినాకంపిరి. అద్దానికినీ ప్రొఫెసర్ గారి వ్యాసంబుకథకును గొంతభేదంబును నాయీకథకు మఱికొంతభేదంబునుగలదు. శ్రీమాశాస్త్రిలవా రంపిన కథామాతృక నాకుఁ జెందక పూర్వమే నే నదివఱకనేకులచే విని శైవాచార్యచరిత్రంబందుఁ గాంచి యీచరిత్రంబును వ్రాసితిని. ఐనను బాధకమేదియు లేదు. జన్మస్థానము ద్రవిడదేశమందలి కంసపురంబైనను గాంచీపురంబైనను సమానమే. ఏకామ్రేశసన్నిధినైనను అగ్నీశసన్నిధానమునన్నైనను నొకవిధమే. ఇఁక హరదత్తునిజననీజనకులసందర్భమందు మాత్ర మించుక భేదం బగుపడును. తావన్మాత్ర భేదమున్నను లోగడవ్రాసిన ప్రధానకథాసాధకములు తప్తనిశ్శ్రేణ్యధిరోహణము చతుర్వేదతాత్పర్యసంగ్రహగ్రంథకర్తృత్వము పంచరత్నశ్లోకవిరచనము మున్నగునవి సాధారణధర్మంబు లస్మత్కథానాయకునకు భేదంబును బ్రతిపాదించుచున్నవి. యుక్తిం యొంచి ద్భేదంబున నేకదేశవికృతన్యాయంబున నెట్లో వైరుధ్యాభావంబును సహృదయులు యోజింతురుగాక

యని మనవి. ఇఁకను హరదత్తాచార్యునికాలము నిర్ణయించుటలో శ్రీరామానుజపరంపరాశిష్యుఁ డగు శ్రీకూరేశపండితుని కూరేశవిజయ గ్రంధమందుఁ గూరేశుఁడు హరదత్తవాదంబునకు బూర్వపక్షముచేసి యున్నకతమున శ్రీరామానుజులకాలమున కర్వాచీనుఁడనియుఁ గూరేశ పండితునికన్నఁ గొండొక పూర్వుఁ డనియును దోఁచుచున్నది. శ్రీరామానుజులకుఁ బూర్వుఁడు కాని సమకాలీనుఁడు గాని యైనచో శ్రీరామానుజులే వారివాదంబునకుఁ బూర్వపక్షముచేసి యుందురు. అట్లు జరుగ లేదు. హరదత్తుని పరోక్షంబునఁ దద్వాదంబును గూరేశపండితుఁడు పూర్వపక్షించుటచే పై భావన ఋజువగుచున్నది. ఇఁక శ్రీరామానుజులు క్రీస్తుశకము 1017లో జన్మించి 1130వఱకు జీవించి శ్రీవైష్ణవమత స్థాపకులై తద్వ్యాప్తిం బొనరించినట్లు చరిత్ర మగుపడుచున్నది. హరదత్తుఁడు రామానుజులచరమదశయందు జన్మించి యుండునని తోఁచుచున్నది. ఇఁకను శ్రీవిద్యారణ్యకృతశంకర విజయకావ్యం బందు శ్రీశ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు వాదార్థమై శ్రీశ్రీనీలకంఠభగవత్పాదాచార్యుల సముఖమున కేగినపుడు తదంతేవాసి హరదత్తుఁ డుండెనని వ్రాయుటచే నాహరదత్తుఁడీతఁడేనా భిన్నుఁడా యను సందియ మందీ హరదత్తునికన్న సుమారు వేయిసంవత్సరములు పూర్వులైన శంకరనీలకంఠులకాలములోని వాఁడీయన యగుటెట్లుపొసంగును. భిన్నుఁడే. సమాననామధారణము బాధకముగాదు. ఇఁకఁ గల్పసూత్రమునకు భాష్యం బొనర్చిన హరదత్తుఁడు చతుర్వేదతాత్పర్యసంగ్రహ గ్రంధకర్తకన్న భిన్నుఁ డని కొందఱు వ్రాసినారు. సాధకమేదియుఁ గనపఱచలేదు. భిన్నుఁ డనుటకుఁగాని యభిన్నుఁడనుటకుఁ గాని హేతుసామగ్రీప్రకటనావశ్యకత సామాన్యంబైనను భిన్నుఁడనెడువారల కధికతరంబని పరిశీలకు లరయకపోరు. వారు భిన్నుఁడని యెట్లనిరో నే నింద భిన్నుఁడని యట్లే తలఁచుచున్నాను. ఇఁకఁ బ్రస్తుతహరదత్తుఁడు గూడ శ్రీనీలకంఠారాధ్యపారంపర్యములోని వాఁడని ప్రతీతికలదు. ఇపుడు ప్రచారములోఁ గల శ్రీశంకరాచార్యాదిమతపీఠము లున్నట్లుకాలములలో శైవాచార్యపీఠములు గొన్ని యుండెను. అందు శ్రీనీలకంఠా

చార్యపీఠము మిగులప్రధానము. ఆ పీఠాధ్యక్షులెల్ల శ్రీకంఠనీలకంఠుల నియే పిలువఁబడుచుండిరి. కావున హరదత్తాచార్యసమకాల మందు వెలయు నీలకంఠారాధ్యునియొద్ద గౌరవార్థముగా హరదత్తుఁడు శుశ్రూష చేసి యుండును. గాన నట్టి ప్రతీతియు బాధకముగాదు. పదంపడి కొంత కాలమున కాపీఠములు మతాంతరాక్రాంతములైనవి. ఈయది గొప్పపరి శీలకు లోకచో నుద్ఘాటించిరి. ఇప్పటికి హరదత్తునికాలమును నైతిహ్యాం బును గూర్చి వ్రాసితిని. ఇఁక శివానుగ్రహముచే హరదత్తుఁడు జన్మించు టయు శివదీక్షాదుల నొందుటయుఁ గైలాసయాత్ర మున్నగువానినిఁ గొంద ఱీకాలంబున విశ్వసింపరని తెలిసియుఁగూడ శ్రీవిష్ణుచిత్తీయ ప్రబంధకథయందలి శ్రీగోదాదేవీ జన్మమును భగవత్పరిగ్రహణంబును వైకుంఠప్రవేశంబునుమున్నగువాని నమ్మినపాఠకులట్టివారు భక్తులుగొంద ఱేనిఁ దప్పక నమ్ముదురని దృఢముగ భావించి యిప్పటికిఁ బూర్వమందే గీర్వాణోక్తివిరచితంబైన యిచ్చరిత్రంబును నాంధ్రియం దవతరింపఁ జేసి తిని. ఇందు హరదత్తుఁడుపన్యసించె నని వ్రాసినభక్తోపాఖ్యానంబును స్కాందపురాణస్థబ్రహ్మోత్తరఖండమునుండి గ్రహించి యనువదించి తిని. ఈ హరదత్తాచార్యుఁడు రచించినచతుర్వేదతాత్పర్యసంగ్రహగ్రం థంబు నిందు నే నాంధ్రీకరింపలేదు. అయ్యది కేవలశాస్త్రవిద్వేద్యమై యొక భాష్యప్రాయంబుగ నున్నది. నా యీప్రబంధశైలికిఁ దద్భాషాం తరీకరణశైలికిఁ మిక్కిలి భేదంబుగ నుండునని కొన్నిశ్లోకంబులకుఁ బద్యం బులు వ్రాసి కూడ యిందుఁ జేర్పలేదు. శ్రీవారి పంచరత్నస్తవమును మఱికొన్ని యుపనిషదబుక్కులను నిశ్శ్రేణ్యధిరోహణఘట్టమం దాంధ్రీ కరించి చేర్చితిని. ఇందుఁ గొందఱు నేను స్వదేవతామతాభిమానమునను దదితర ద్వేషంబుతోడను నిద్దాని రచించినయట్లు దలంతురేమో కాని నాకట్టి యితర దేవతాద్వేషంబు గాని యితరమతద్వేషంబుగాని లేశమే నియు లేదు. నేను— శ్లో॥ శైవావయం నఖలు తత్ర విచారణీయం। పంచా క్షరీజపపరా నితరాం తథాపి। చేతో మదీయ మతసీకుసుమావభాసం। స్మేరాననం ధరతి గోపవధూకిశోరం॥ అని వ్రాసిన కవియట్టివాఁడను గాని యన్యాదృశుఁడగాను. నాకుఁగల శ్రీవిష్ణుభక్తి మద్విరచిత *శివతత్త్వ నిర్ణయము శివపురాణము మున్నగువానియం దందందుఁ బ్రకటితమైయు

న్నది. ఇఁక నీప్రబంధము విద్వత్కవిరాజశేఖరులసాదరపరిష్కారభాగ్యం బునకుఁ బాత్రంబగుట విబుధలోకాదరభాజనం బగునని దృఢమాగి భావిం చుచుఁ బరిష్కర్తలకుఁ జోతలొసగుచు, సంతసంతో నీపీఠికను ముగిం చెదను.

---

*మదీయేఽముద్రిత శివతత్త్వనిర్ణయే— శ్లో॥ శ్రీచక్రాయుధశిక్షితాసుర చయ శ్శ్రీనాయకో మాతులః । లక్ష్మీర్మాతులగేహినీ కమలజో భానః ప్రమోదావహాః । వాణీ మామకసోదరీ ఋషిగణోస్మద్బాంధవా నాగతాః॥ ఇత్యేతద్ధృది భావయేఽహమనిశం జానీహి విశ్వాధిరాట్॥

ఇట్లు విద్వత్కవివిధేయుఁడు.
ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి
శికింద్రాబాదు.

# విద్వదభిప్రాయములు

ఈ కృతిపరిష్కర్తలు

శతావధానులు బ్రహ్మశ్రీ వేలూరి శివరామ శాస్త్రిలవారు

చిరివాడ

కృష్ణా జిల్లా

దీ॥ 23-2-53

అయ్యా !

మీ శారదత్తచరిత్రము చదివి ఆనందించితిని. మీగ్రంథములో దిద్దదగినదిగాని విసర్జింపదగినదిగాని నాకుఁగానరాలేదు. మిక్కిలి సొగసుగా నున్నది. అట్టితఱి మీరు వ్రాసినవన్నియు వినయవాక్యములు. ఇఁక శైవమే కానిండు వైష్ణవమేకానిండు ఇంకేదియైనగానిండు కవిత్వములో భావితమై రసభావసముదాన్యతరస్థాయికి వచ్చినపుడు అది సార్వజనికమై సహృదయాహ్లాదకరమై భాషలో అమరత్వము చేకూర్చుకొనును. అట్టివానిలో మీగ్రంథమొకటి. శైవమునుగాని శాక్తమునుగాని కవిత్వములో పొదిగి ఇంకను కొన్నిగ్రంథములతో తెలుగువారికి మీరు కర్ణరసాయనము చేయుదురు గాక.

వేలూరి శివరామశాస్త్రి

---

ఉపాధ్యాయపండిత పరిషదధ్యక్షులు – బ్రహ్మశ్రీ మల్లాది సూర్య నారాయణ శాస్త్రిలవారు ధవళేశ్వరము.

ది. 23-2-53

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు రచియించిన శారదత్తవిజయమును సాదరముగాఁ జదివితిని. శివభక్తినిష్ణాతులై శైవమతప్రచారమునకును శైవసారస్వతాభివృద్ధికని దీక్షవహించిన శ్రీశాస్త్రిగారి యుద్యమము ప్రశంసనీయము. శ్రీశివపురాణమును నిర్మించి పరిఁగిన వీరి యీకృతి భక్తమనోరంజకమై పరిఢవిల్లునని యాశించుచున్నాను.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

శ్రీశైవమహాపీఠాధ్యక్షులు శ్రీలోకారాధ్యులు బ్రహ్మశ్రీ విద్వాన్, విద్యాప్రవీణ ముదిగొండ వీరేశలింగశాస్త్రిలవారు-వరంగలు

శివాయగురవేనమః

ఈ హారదత్తవిజయ గ్రంథకర్తలు బ్రహ్మశ్రీ లో॥ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు. వీరు వైయాకరణులు ఉభయభాషాప్రవీణులగుటయేగాక అవధానులు. కీ॥ శే॥ శతావధానులు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ప్రియశిష్యులు. శ్రీశివపురాణాది గ్రంథరత్నంబులం గూర్చి భాషాయోష నలంకారభూషితనుగ నొనర్చినవిద్వత్కవులు. శ్రీశైల మల్లికార్జునస్వామివారి కీపుస్తకము కృతినొసంగిరి. వీరి నివాసము శికింద్రాబాదు. జననీజనకులు లక్ష్మమ్మంబా వీరభద్రారాధ్యులు. తాతగారు మంత్రారాధ్యులవారు. విద్వదవతంసులగువీరు తమకూటస్థపూర్వకవిచే సంస్కృతభాషలో ఆర్యావృత్తములతో మనోహరముగ రచింపఁబడిన హారదత్తచరిత్రమును వీరికి విద్యాభ్యాససమయంబున గురువుగారు వచించిన యితిహాసంబును మాతృకగాఁగొని యీగ్రంథమును రచించిరి.

ఈ హారదత్తచరిత్రను గూర్చి పలువురు పలువిధములుగ వక్కాణించుచున్నారు.

సర్వవిధముల ఈహారదత్తుం డేకామ్రేశ్వర వరప్రసాదజనితుఁ డగుట స్పష్టము. అందుచే నీమహామహుఁడు శైవచిహ్నముల ధరించి బాల్యము నుండియే శివోత్కృష్టతను బ్రతిపాదింపుచుఁ బ్రత్యక్షనిదర్శనముఁ జూపించుచుమని వాదసభలో నడిగినపుడు కాలుచున్న పెనముమీఁదఁ గూర్చుండి "కోవానయో రధిక ఇత్యనుచింత్య వృద్ధా స్సత్యంబ్రువంతు తమిమం వయ మాశ్రయామః" అనుమకుటముతోఁ గొన్నిప్రశ్నలిచ్చెను **. ఎవరును బ్రత్యుత్తరముచెప్పకున్న చిట్టచివరకు శివపారమ్యమునుగూర్చి 24 కారణములు అనివార్యములగునవి చూపించి శ్లోకపంచకము నాశువుగఁ జెప్పెను. అది మొదలు హారదత్తాచార్యు లవతారపురుషులుగ భావింపఁబడుచుండిరి.

---

** అందులో నొకటి యిది—శ్లో॥ ఏకో విశేశ సరయూసలిలాంతరాళే త్వన్యో దధా త్రిపదగాం ఘటవ జ్జటాయాం కోవానయో రధిక ఇత్యనుచింత్యవృద్ధా స్సత్యం బ్రువంతు తమిమం వయమాశ్రయామః॥

హరదత్తుని ప్రశ్నలతోఁ గూడినశ్లోకములకు హరిహరతారతమ్య మనియు ఏదుశ్లోకములకు పంచరత్నమాలిక యనియు పేరు. మదరాసు విశ్వవిద్యాలయమున రీడరుపదవి నధిష్ఠించిన శ్రీ యస్. యస్. సూర్య నారాయణశాస్త్రి యమ్. ఎ. గారు శివాంకమను హిందీగ్రంథ మందలి 473 పేజీలో పై విషయము వ్రాసియున్నారు. శ్రీముదిగొండ వీరభద్రా రాధ్యులవారు వ్రాసిన ద్వాదశారాధ్యచరిత్రయందు నీలకంఠవిజయమం దును హరదత్తునిప్రశంసకలదు.

హరదత్తాచార్యులు తనదివ్యసూక్తులని సర్వవిద్వత్సభాంగణములందుఁ బ్రజ్వ లింపఁజేసినాఁడు. వీరు చతుర్వేదతాత్పర్యసంగ్రహమను నామాంతరముగల శ్రుతి సూక్తిమాల యనుగ్రంథరత్నంబు రచించినాఁడు. కొండవీటిరెడ్డిరాజులలో పేరు ప్రతిష్ఠల నార్జించిన శివలింగభూపాలు డనురాజు తత్త్వప్రకాశిక యను పేరుతో పై గ్రంథమునకు చక్కనివ్యాఖ్యానమును వ్రాసియున్నాడు.

ఇఁక ఈ హరదత్తవిజయమునందలి కైలాసవర్ణనము కమలకోమల శివభక్తి నాదసభ చండకళిల్లచరిత్రము నవ్యకవితా పద్ధతులతో నాట్య మాడినవి.

తీర్థయాత్రాప్రకరణమేమి పురవర్ణనమేమి తదితరములగు కథా సందర్భములేమి తులతూఁచినటుల ఆయాఘట్టములను సంగ్రహముగ రస వంతముగ నేర్చి కూర్చినశాస్త్రిగారి ప్రతిభానైపుణ్య మెంతయుఁ బ్రశంస నీయము.

కైశికీవృత్తిలో వైదర్భిరీతిని మేళగించి ద్రాక్షాపాకములో మధురమగుకవితావస్తువును సహృదయ హృదయంగమముగ సృష్టించి యినుమునయస్కాంతమువోలె పాఠకలోకహృదయముల నాకర్షించిన గ్రంథకర్త గారి చాతుర్యమును గాంచిన

ఉ॥ కవితయనంగ పద్యములు గద్యములున్ రచియించుటౌనె? భా
వవిలసనంబు లోకహితవర్తనముం బచరింపఁజేసి క
న్గవకును నద్దమెట్లటుల గ్రంథచమత్కృతినేర్పుపెంపునం
బ్రవిమలవస్తుతత్త్వమును భాసిలఁజేయుటగాక యారయన్॥

యను ప్రాచీనకవిరత్నముల పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది.

అష్టావరణపంచాచారసహితు డగు హరదత్తాచార్యులవారి చరిత్రలోఁ జిన్మయదీక్షితుఁ డైనభక్తుని చరిత్రను సమకూర్చుటయు రసవంతములగు నాయాస్థలములయందు రసము జాలువారునట్టుల పోతన కవివలె మఱిరెండుమూడుపద్యము లెక్కునగ వ్రాయుటయు సంభవించినచో యీకావ్యమిత్యధిక రమణీయముగ నుండియుండెడిదని నాయూహ. (1 ఆశ్వాసము) 34, 37, 38, 39, 43; (2 ఆ) 2, 4, 28, 37, 40 (3 ఆ) 70 ఈపై పద్యములు మచ్చునకుఁ జదివిన శాస్త్రిగారి వైదుష్యము కవితాలాలిత్యము వ్యక్తమగును. మఱియు నిందలి చతుర్థాశ్వాసము కవికులతిలకుఁ డగు కాళిదాసమహాకవి శాకుంతలనాటకములోని చతుర్థాంకము వోలె నాచంద్రతారకము సకలవిద్వత్కవిమాన్యమై తనరారు ననుటలో నావంతయు నతిశయోక్తి లేదు.

కావుననే "ఇది నిర్దుష్టయు గుణవతి మృదులయు లలితయునుఁ గడు సమీచీనార్థాస్పదయును విదుషియు నయితగు" నని కావ్యకుమారినిఁ గూర్చి పంచమాశ్వాసమున అంతర్వాణిచే శాస్త్రిగారి నోట పలికించిన పలుకులు ముమ్మాటికిని యథార్థములని నాయభిప్రాయము.

ఇట్లు

వరంగల్ — ముదిగొండ వీరేశలింగశాస్త్రి

25—2—53 — విద్వాన్, విద్యాప్రవీణ.

## శికింద్రాబాదు వెస్లీహైస్కూల్ ప్రధానాంధ్రపండితులు
## బ్రహ్మశ్రీ విద్వాన్ వెల్లంకి వెంకటరమణయ్యగారు

సెకండుబజారు
25–2–53

ఆర్యా!

తమచే రచింపఁబడిన హారదత్తవిజయ మనుకావ్యమును శ్రద్ధాళుఁడనై చదివితిని. భక్తశిరోమణి యగునొక మహాపురుషుని చరిత మిందు వర్ణిత మగుట కడుశ్లాఘ్యమైనది. శాబ్దికులగుమీ వాణి విశుద్ధ మనియు సలక్షణమనియు నుడువఁ బనిలేనిపని. స్వప్నమున శ్రీగిరీశుఁడు మీకానతి యొసంగినట్లు రసోద్ధరచారుతరోరుధారలతో శైలి యొప్పారుచు సుగమముగానున్నది.

ఇట్లు భవదీయుఁడు
వెల్లంకి వెంకటరమణయ్య విద్వాన్.

శికింద్రాబాదు మహబూబుకాలేజి హైస్కూలు
ప్రధానాంధ్రోపాధ్యాయులు విద్వచ్ఛిరోమణులు బ్రహ్మశ్రీ
సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిలవారు.

శ్రీపూజ్యపాదులు ముదిగొండనాగవీరయ్యశాస్త్రిగారు అనువదించిన హరదత్తవిజయమును లెస్సగాఁ బరికించితిని. ఇందలి కథావస్తువు ఆముక్తమాల్యదలోని యామునాచార్య చరిత్రమునకుఁ బ్రతిద్వంద్వి. అది విష్ణుపారమ్యమును ఇది శివపారమ్యమును నుద్ఘోషించును. వైష్ణవులకు యామునాచార్యచరిత్రమును శైవులకు హరదత్తవిజయమును శిరోధార్యములు. మాకు రెండును శిరోధార్యములే. "శివాయవిష్ణురూపాయ శివరూపాయవిష్ణవే శివస్యహృదయంవిష్ణుః విష్ణోశ్చహృదయంశివః" అను సిద్ధాంతముమాది.

శ్రీనాగవీరయ్యశాస్త్రిగారి కవిత్వమునుగుఱించి ప్రత్యేకించినుడువ నక్కఱపట్టదు. మహాగ్రంధమైన శివపురాణమును దెలిగించి యఖండ కీర్తినార్జించిన శ్రీశాస్త్రిగారికవిత్వము వారిపాండిత్యమును లోకవిదితములు. మృదుమధుర శైలి పురాణమైనను గావ్యశిల్పమును బోషించినారు.

ఈ గ్రంథమునకు తస్తనిశ్శ్రేణీసోపానాధిరోహణఘట్టము మకుటాయమానముగానున్నది.

ది॥ 11-3-53 సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

వైయాకరణశిరోమణులు నరసరావుపేట కాలేజీ సంస్కృతాంధ్రోపాధ్యాయులు బ్రహ్మశ్రీ తూములూరు శివరామకృష్ణ శాస్త్రిగారు ఎం. ఏ.

ది॥ 11–3–53

ఆర్యా!

నమస్కారోభయకుశలోపరి. తాము దయతో పంపిన హారదత్త విజయ మనుగ్రంథము చేరినది. ఆమూలాగ్రము చదివి ఆనందించితిని. మీ ప్రాచీనులు సంస్కృతమున రచించిన మాతృక చక్కగావి స్తరింపఁబడినది. సులలితము మధురము నిర్దుష్టము నగు శైలి మీకు వెన్నతోఁడ బెట్టినది. కథాభాగము మతవివాదములకు సంబంధించినదైనను మతాంతరసహాన రచన మీగ్రంథమునకు వన్నెపెట్టినది. నారదునకు శివుఁడిచ్చిన ప్రత్యుత్తరము మిక్కిలి ఔచిత్యపోషకముగనున్నది. "ఒకలింగఁడుడిగిన నుడిగినట్టని" మున్నగు జాతిరచనలు కవితకలంకృతులు. మీకవిత "నిర్దుష్టయు గుణవతి మృదులయు లలితయును గడుసమీచీనార్థాస్పదయును విదుషియు" ననుటకు సంశయములేదు. కనుక

కం॥ కృతిపతి మల్లేశానుఁడు
కృతియో హారదత్తవిజయ♦గీతం బిఁక నీ
కృతికర్త శైవకవి పం
డితజనముల కిద్దిప్రీతి ♦నెరపుటయరుదే.

ఇట్లు విధేయుఁడు
తూములూరు శివరామకృష్ణశాస్త్రి ఎం. ఏ

## బ్రహ్మశ్రీ దివాకర్ల వెంకటావధానిగారు ఎం. ఏ. ఆనర్సు ఉస్మానియా విశ్వవిద్యాలయము లెక్చరరు

శ్రీయుత ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిలుగారిచే రచింపఁబడిన హారదత్తవిజయము నామూలాగ్రముగఁ జదివి యానందించితిని- ఇందు హారదత్తాచార్యుని జననాదికమును ఆతఁడు చోళరాజాస్థానమందలి పాంచరాత్రపండితులను వాదమునఁ నోడించి నిదర్శనమునకై తప్తలోహ నిశ్రేణి నధిరోహించి యారాజును మరల శైవమతదీక్షితు నొనరించుటయేకాక ప్రపంచమందంతటను శైవమతమును వ్యాపింపఁజేయుటయుఁ జక్కఁగా వర్ణింపఁబడినవి. ఇందలిరచన యెడనెడ శ్రీకృష్ణదేవరాయలవారి యాముక్తమాల్యదయందలి రచనను స్మరణకుఁదెచ్చుచున్నది. పద్యములు ధారాశుద్ధిసంభరితములును జాతీయపదశోభితములునై యలరారుచున్నవి. శ్రీశాస్త్రిలవారి కాంధ్రగీర్వాణ భాషలందుఁగల యపారపాండిత్యము గ్రంథమందంతటను వ్యక్తమగుచున్నది. శివపురాణరచనముచే నాంధ్రదేశమందంతట సుప్రథితులైన శాస్త్రిలవారి శైలినిగూర్చి నేనింకను వేఱేవివరింపనక్కఱలేదు.

దివాకర్ల వెంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు)
ఉస్మానియా విశ్వవిద్యాలయము
దిII 20—3—53

---

| పుట - బంతి | | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 45 | 10 | ట్లీరజ్జుల్ | ట్లేరజ్జుల్ |
| 46 | 15 | కాంచినా | కాంచికా |
| 47 | 1 | తనను త్రిశుద్ధిగఁగొలిచెడు | అనిశముదన్ను భజించెడు |
| 64 | 10 | పాజివిష్ణులకగో | పాత్మభూవిష్ణుగో |
| 74 | చివరబంతి | పరితుష | పరితుష్ట |
| 93 | 1 | నమత్తకాశిని | నమ్మత్తకాశిని |

# విషయసూచిక

---

# తప్పొప్పులు

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 2 | పుత్రి | పుత్త్రి |
| 15 | 12 | కరుణో | కరుణా |
| 16 | 9 | ఏకామే | ఏకామ్రే |
| | 11 | వాకేతూహాల | నాకౌతూహాల |
| 29 | 8 | బ్రొద్ధలు | బొద్దులు |
| 32 | 18 | సాన్నాయి | సన్నాయి |
| 57 | 2 | విభునిప్రతినిధియైనట్టి ♦ విధుడుచేరి తనకరంబుల నామహా♦ధ్వాంతములను (సవరణ) ఇనునిప్రతినిధియైన ♦ పూర్ణేందుఁడరసి తతిసి కరముల నమ్మహా♦ధ్వాంతతతిని | |
| 59 | 3 | పద్మినీసముదయవి (సవరణ) పద్మినీలత యతులవి | |
| 64 | 10 | పాజవిష్ణులకగో (సవరణ) | పాత్మభూవిష్ణ్వగో |
| 85 | 13 | నిర్మలాభావా! | నిర్మలభావా! |
| 86 | 21 | తనియుసుఖముల్ | తనియుసుఖములల్ |
| 82 | 14 | మృదంద | మృదంగ |
| 93 | 1 | నమత్త | నమ్మత్త |
| 95 | 12 | బసము | బసవు |



కృతిపోషకులు

మ॥రా॥శ్రీ గోపిశెట్టి రత్నయ్యగారు

సికిందరాబాద్.

# శ్రీకృతిపోషకాశీర్వచనము

---

శా॥ శ్రీదుం డయ్యెఁ గుబేరుఁ డెవ్వని కృపా♦శ్రీభాగ్యసంపత్తి నా
హ్లాదం బొందెఁ బయోధిముఖ్యవిభవ♦ప్రాప్తిన్ మునీంద్రాత్మజుం
డే దాక్షిణ్యనిధానుమేదురకృపా♦హృద్యప్రసాదంబుచే
నా దేవాగ్రణి గోపిసెట్టికులు ర♦త్నార్యున్ జిరం బేలుతన్॥

క॥ గోపశ్రేష్ఠగృహాసిత
శ్రీపతి యల శౌరి మేల్మి♦సిరి యలరఁగ నీ
గోపిశ్రేష్ఠికులాంకు సు
నీపరు రత్నార్యు మనుచు ♦ దీర్ఘాయుష్కున్॥ 2

సీ॥ ఎవ్వాని కాపురం ♦ బిందిరాచరణాబ్జ
నూపురంబైన సే♦నాపురంబు
ఎవ్వాని కులదైవ ♦ మిందురేఖాసమా
లంకృతమూర్ధన్య♦లలితమూర్తి
ఎవ్వాని నిజగోత్ర ♦ మెసఁగుఁ గన్యాంబాకృ
పాఖ్యంబు గంధశై♦లాహ్వయంబు
ఎవ్వాని తలిదండ్రు ♦ లిభ్యులు రత్నమ్మ
రామచంద్రార్యుం డభి♦గమ్యచరితు

తే-గీ॥ డెవని పత్ని మహాలక్ష్మి♦కెనయనంగఁ
జాలు శేషమ్మ పావన♦శీల యలరు
నట్టి రత్నార్యవర్యున ♦ కఖిలసుఖము,
లిచ్చి రక్షించుఁగాత బా♦లేందుమౌళి॥ 3

శా॥ బంగారంబును వెండి రూప్యములు సొ♦ల్వాల్ వల్వలున్ విస్ఫుర
ద్భంగుల్ భూషలు తండులాదికలస♦ద్ధాన్యంబు లన్యంబులౌ
రంగద్వస్తువు లర్థిసంఘములకున్ ♦ రాణింప నేప్రొద్దునున్
బొంగొప్పంగ నొసంగు రత్నయ సుధీ♦పుంజంబు రంజిల్లగాన్॥ 4

క॥ ఆయుర్వేదౌషధధ
ర్మాయతనమనోజ్ఞశాల • నఖిలశ్రేయో
దాయకముగ నిర్మించి త
దీయకృతికి రత్నమార్య • ధీమణి యొసఁగెన్॥ 5

ఉ॥ పెక్కులు చెప్పనక్కఱయుఁ • బేరిమి లేదొకముక్క మాత్రమే
నొక్కి వచింతు నెప్డయిన • నర్థి దను నర్థనచేసినట్టియే
గొక్కనికేని "నాస్తి" యను • నుక్తి వచింపఁడు రత్నమార్యుఁ డీ
గొక్కటి చాలదొక్కొ తన • యుజ్జ్వలతేజము నింప దిక్కులన్॥

తే-గీ॥ ఇట్టి గుణనిధియై పృథ • నెసఁగునట్టి
గోపిసెట్టికులాబ్ధీందు • గురుహితుండు
రత్నమార్యుండు నాకృతి • రత్నమునకుఁ
బోషకుండయి ముద్రించెఁ • బొసఁగు శుభము॥

క॥ హారదత్తచరిత్రమునను
హారుసముతో నాధిపత్య • మంది వినిన శ్రీ
గిరినాథుఁడు మల్లేశ్వరుఁ
డారుకృప రత్నార్యు మనుచు • నూర్జితచరితున్॥

క॥ ఒకకొదువ గానుపింపదు
సకలము సమకూరె నమరె • సంతస మసి ప్ర
జుకు లెన్న వంశవృద్ధియు
నిఁక రత్నయకొసఁగుతన్ మ • హేశ్వరుఁడు రహిన్॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు
ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి.



శ్రీ శివాభ్యాన్నమః

# హరదత్త విజయము

ఉ.* శ్రీగిరిరాజజావిమల ♦ శీలవశీకృతచిత్తుఁడై కరం
బాగుణిశీసమర్పితమ ♦ హత్తరసౌరభమల్లికాసుమ
శ్రీగరిమప్రమోదమునఁ ♦ జెన్నెసలారఁగ మల్లికార్జునా
ఖ్యాగతుఁడైన శంకరు న ♦ హర్నిశమున్ భజియించెదన్ మదిన్.

శా॥ ఆకల్పద్రుమనిర్విశేషముగ నా ♦ యౌదుంబరగ్రామమున్
నాకస్త్రైణముతో సరాసరి బుధిం ♦ దస్త్రీతతిన్ దివ్యగం
గాకల్లోలినితోడఁ గృష్ణను మొలన్ ♦ గావింపఁగా నెంచి బ
ల్వీకన్ శ్రీగిరిఁ జేరినట్టి శివదే ♦ విన్ భ్రామరిన్ గొల్చెదన్॥

ఉ॥ ఆ హిమశైలజాముఖన ♦ ఖారుణదీధితిమంతుఁడుండు ప్ర
త్యాహతమోవిదారణ వి ♦ ధుండు మహాఘసముచ్చయాటవీ
దాహధనంజయుండు ప్రణ ♦ తప్రకరేప్సితకల్పభూరుహం
బౌ హరదత్తరత్నమగు ♦ నాదిమపూజ్యుని సన్నుతించెదన్॥

చ॥ అభినవదివ్యయౌవనమ ♦ హంబున సుందరదివ్యదేహసౌ
రభమున నన్యదుర్లభవి ♦ గాఢితశీలమునన్ మహాతపో
విభవమునన్ జతుర్ముఖుని ♦ వేడ్కనలర్చు సతీమతల్లి నా
కుభయమువచస్సముల్లసత ♦ నొప్పఁగ నిచ్చుత వాణి నిచ్చలున్॥

క॥ శ్రీవిభుని వీరభద్రుని, దేవచమూపతిని నహిమ ♦ దీధితిముఖది
వ్యావళిని భక్తిమై నే, సేవించెద నిష్టసిద్ధి ♦ చేకూర్చుటకై॥

---

* శ్రీగిరిరాజజ - ఈమె శ్రీశైల రాజకుమారియగు చంద్రవతి యనుకన్య—

సీ॥ శ్రీవేమనారాధ్యుఁ ♦ జన్మయదీశుఁ బ్రో
దానధౌరేయుఁ జి ♦ త్తమునఁ గొలిచి
వీరమల్లవధాని ♦ భూరివేదాగమాం
తర్వాణి మదిని నెం ♦ తయు భజించి
సీరుఁ జిట్టావఝ్ఝారి ♦ దేశికు శార్ద్విక
పురుహూతు మనమునఁ ♦ బూజచేసి
** నగుపతివేంకటే ♦ శ్వరకవిబ్రహ్మల
శతవధానుల సమ ♦ ర్చన మొనర్చి॥

తే-గీ॥ ఘనుస సమానిరాజయా ♦ ఖ్యాను శాస్త్ర
మంత్రివిద్రాజమకుటుల న ♦ మస్య సలిపి
తగ రచించెద నే హార ♦ దత్త విజయ
మను ప్రబంధంబు బుధులు గొం ♦ డాడ సభను॥

— కవి స్తుతి —

సీ॥ పరాకందఫలసార ♦ మధురరసాస్వాద
వాక్పాకి వాల్మీకి ♦ వాంసి కేలెఁగి
చిత్రివిచిత్రిచం ♦ రిత్రశోభితకథా
బంధవిన్యాసు శ్రీ ♦ వ్యాసు నెంచి

---

** విరోధినాం॥ మాఘకృష్ణ చతుర్దశియం దస్తమించిన శ్రీ శ్రీ వెంకటేశ్వర గురుని గూర్చి తత్కాలమున రచించిన పద్యద్వయము.

శ్లో॥ । శ్రీమద్వేంకట కవిరాట్ । శివలీలాది ప్రబంధ శతకర్తా
శరది విరోధిని (శివరాత్రౌ) శివపద మగాద్భుతవధానీ॥

సీ॥ తిరుపతి పిలిచెనా! దేవేంద్రగురుతోడఁ ♦ గవితోడవాదుకుఁ గడఁగిదివికి
చతురాననుఁడు భవచ్ఛతవధానక్రియు ♦ కలరి యాహ్వానించె నా స్వగోష్ఠి
కా నీదురాజ్ఞి తా నల రమావిష్ణువు ♦ గొల్వనమ్మని నా వైకుంఠపురికి
శివరాత్రి నీచేత శివలీలలను విన ♦ శివుఁ డు రమ్మనె యెనా శివనగరికి॥

తే-గీ॥ నాకమున కేగి చతురాన ♦ ననభవుఁ జని
హరిపురిం జేరి యటనున్న ♦ యాశ్మ దేవి
తోడ లక్ష్మీశవిభులఁ గొల్చి ♦ తోమ మాడ
నే మహేశ్వర పద మొందె ♦ తే మహాత్మ! ॥

కవిజనాలంకార ♦ కమనీయకావ్యసం
ధానకౌశలుఁ గాళి ♦ దాసుఁ గొలిచి
అనితరసాధార ♦ ణోచ్ఛకావ్యధురీణ
తాగణ్యు బాణుఁ జ ♦ క్కఁగ భజించి

తే-గీ॥ మఱియును దండి భవభూతి ♦ మాఘ భార
వులను జోరమయూరభా ♦ సులను భట్టి
రాజశేఖరపండిత ♦ రాజభోజ
బిల్హణాకవీంద్రులను సర ♦ వి నుతించి॥

వ॥ ఇఁక నాంధ్రీయుండు.

చ॥ కమలమరందబంధురసు ♦ గంధవచఃపరిపాకసుందరో
త్తమకవితాసతీప్రియవి ♦ ధానసమర్పితచారుభారతా
గమపరితోషభూషితు జ ♦ గన్నుతపండితసార్వభౌముఁ బ్రే
మమున మదాత్మయందు బలు ♦ మాఱు భజించెద శబ్దశాసనున్॥

చ॥ సొగసగు లేఁత జవ్వనపు ♦ చొక్కపుచక్కని మేల్మెఱుంగులొ
ప్పుగఁ గడు నొప్పు మేల్మివిరి ♦ బోణియొయారపు నిక్కచన్నవన్
దగుకపురంపు గందముల ♦ తావుల ప్రోవులఁ గుప్పకైత ని
మ్మగ వెలయించి భారతముఁ ♦ బూర్తియొనర్చిన యజ్వ నెన్నెదన్॥

చ॥ ఉరుతరమాధురిన్ నళిన ♦ ముజ్జ్వలగంధమరందసారమున్
పరుస నొసంగి మాధుకర ♦ వారము నూరఁగ జేయునట్లు సం
బరమిడు సత్కవిత్వపరి ♦ పాకమునన్ బరిశిష్టభారతం
బిరవుగఁ గూర్చి తద్జ్ఞుల ర ♦ హించిన ప్రోడను గొల్తు నెఱ్ఱనన్॥

సీ॥ అనవద్యహృద్యధా ♦ రావహోక్తిసనాథు
శ్రీనాథు భక్తిమైఁ ♦ జెలఁగి మ్రొక్కి
పాశుపతగ్రంథ ♦ పరితుష్టశివకవి
స్తోము శ్రీపాల్కుర్తి ♦ సోముఁ గొల్చి

క॥ కుంభీనసేశ్వరేశ్వర, శుంభద్యజ్ఞోపవీత♦శోభితునకు దో
స్తంభధృతాజగవునకున్, గంభీరానంతసార♦కారుణ్యునకున్॥

క॥ ప్రాలేయాచలకన్యా, శీలతపోరూపతుష్ట♦చేతోబ్జునకున్
బాలామృతకరరేఖా, కీలితచూడునకు భర్మ♦గిరిచాపునకున్॥

క॥ పాండురమహోక్షవాహన,
శౌండున కస్తమితదైత్య ♦ సముదయునకుఁ గో
దండీకృతమేరునకున్,
శుండాలాననషడాస్య♦సుతయుగ్మునకున్॥ 27

క॥ కమలప్రియహిమకరశిఖి, కమలోద్భవదివ్యనయన♦కమనీయునకున్
సుమశరతనుదహనునకున్, యమకంఠచ్ఛేదనాఢ్య♦హస్తాబ్జునకున్॥

క॥ మల్లేశ్వరునకు గిరిజా, హల్లకపాణీతపఃఫ♦లాయితునకు వ్యోః
కల్లోలినీవిహార, ప్రోల్లలితకపర్దభూమి♦భూషితునకున్॥

వ॥ అర్పితంబుగా నాయొనర్పంబూనిన హారదత్తవిజయప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

—: కథాప్రారంభము :—

ఉ॥ మున్నల యామునార్యుఁడు స♦మున్నతిఁ జోళనృపాలగోష్ఠియం
దెన్నికమీఱ శైవుల జ♦యించి తదీయధరాధినాథునిన్
బన్నగరాజతల్పునకు ♦ భక్తునిగా నొనరించి వైష్ణవా
భ్యున్నతిఁ గూర్చె శర్వజను ♦ లొందిరి వేఱొకదేశ మార్తతన్॥

ఉ॥ దేశమునందు నెల్లెడల ♦ "దేవుఁ డనన్ హరియే, సమస్తమా
కేశవునిచ్ఛచేఁ బొదలుఁ ♦ గేశవుఁడే పరతత్త్వ మెందునన్
శ్రీశునిఁ గొల్చు నమ్మతమె♦యిభ్య మసభ్యము భిన్న"మంచు నా
దేశముచేసె తేఁ డటులె ♦ దిద్దిరి శ్రీతిరుచూర్ణ మెల్లరున్॥

వ॥ ఇఁక నక్కాంచీనగరియందు

సీ॥ వెలిబూది గనుపట్ట ♦ వెలికిఁ జిమ్మెకాని
పెరటనేనియు నుంప ♦ వెఱచు జనము

శివరాత్రిఁబస్తేరు ♦ చేసిన నెఱిఁగి వా
రల పేరు లధికార్లు ♦ వ్రాయుచుందు
రేకామ్రపతిగుడి ♦ కేగువారల నేదొ
సాకుతో నారెకుల్ ♦ సాగనీరు
"ఒకలింగఁ ముడిగిన ♦ నుడిగిన ట్టని" కూట
రాయి మ్రింగును బాంచ♦రాత్రజనము

తే-గీ॥ బిల్వవృక్షంబులకుఁ బన్ను ♦ వేయఁ జూతు
రంగళులయందు రుద్రాక్ష ♦ లమ్మ్రు టరుదు
శైవు లెవ రేనిఁ దత్సీమ ♦ జన నడలుదు
రెలమి శ్రీవైష్ణవులకూట ♦ మేపుమీఱ॥

ఉ॥ ఇట్టులు వీరవైష్ణవమ♦తైకధురంధర తాప్రకారతన్
గట్టడిపూన్కి నేఁడు శితి♦కంఠమతంబు హతంబు సేయఁగా
గట్టిప్రయత్నముల్ సలుపఁ ♦ గా దనఁజాలక పోయి కేరున్
నెట్టనఁ గొంతకాలమది ♦ నెట్టుకపోయెఁ దనంత నెట్టటో॥

—: నారదముని కైలాసాద్రి కేగుట :—

వ॥ అంత

మ॥ ఒకనాఁ డిందుధరాంఘ్రిసేవనమునం ♦ దుద్యుక్తచిత్తంబుతో
సకలంకాత్ముఁడు నారదర్షి మహతీ♦వ్యాసంగసంశ్లోకితే
దకరుం డై గగనాధ్వయానమున ను♦ద్యత్తుంగశృంగాగ్రగ
పరికరభ్రాజదనూనదీప్తివిసరా♦వాసంబుఁ గైలాసమున్॥

ఆ-వె॥ చేరి తద్గిరీంద్ర♦శిఖరాంతరాళవి
భ్రాజితప్రధాన♦వనపదంబు
నందు డిగ్గి యచటి ♦ యభినవతరులతా
సముదయములసొంపుఁ ♦ జక్కఁ గనుచు॥

సీ॥ మాకందముల సుమ♦మాకందముల పక్వ
ఫలగుళుచ్ఛచ్ఛవి♦ప్రతతిఁ గాంచి

నారంగముల గణ♦నారంగముల ఘన
    ప్రసవప్రకర సౌర♦భంబు లెఱిఁగి
శ్రీఫలంబులఁ దప♦శ్శ్రీఫలంబుల మహా
    భాస్వరచ్ఛాయల ♦ పదవు లొంది
నందివర్ధనము లా♦నందవర్ధనముల
    గ్రంధదన్మిళిందఝం♦కార మరసి

తే.గీ॥ కర మశోకములొ నశో♦కములగముల
తతసుసంతానవీథి సం♦తానవీథిఁ
జేరి శతరుద్రసూక్తంబుఁ ♦ జెప్ప రాజ
హంసలను రాజహంసల ♦ సరసిమురిసి॥

మ॥ పరిపాకోరుఫలావళీ స్తబకరం♦భాపాదపప్రాప్తని
ర్భరసౌరభ్యపరాంపరావృతుల నా♦ఘ్రాణింపుచుం గోస్తనీ
పరిపక్వచ్ఛగుళుచ్ఛభోజనశుక♦ప్రారంభితామ్నాయసుం
దరపారంబుల నాలకించుచు నితాం♦తప్రీతచేతస్కులై॥

వ॥ ఇట్లు చనిచని

శా॥ కాంచెం గాంచనగర్భసంభవుఁడు ప్రేం♦ఖత్పద్మరాగోపల
ప్రాంచచ్చారుఫలోచ్చయాయుతనశా♦ఖావాసవాస్తవ్యది
వ్యాంచచ్ఛాసనిమండలీకలకలా♦వార్యప్రవాదంబు నా
చంచత్కర్బురదివ్యభద్రవటభూ♦జాతంబుఁ బూతంబునన్॥

వ॥ కని యనేకయోజనాయామవైశాల్యభాసురంబును దేవాసుర ప్రమథవీరమండలీపరివేష్టితంబును నగు తచ్ఛాయాప్రదేశంబు నందు.

క॥ మరకతసోపానంబులఁ, గురువిందమహావితాన♦కుడ్యంబుల భా
స్వరశశికాంతస్థలులన్, హరువగు మణిమయమహాస♦భాంతర
భూమిన్॥

క॥ నవరత్నఖచితంబగు, సువర్ణసింహాసనమున ♦ సొంపగు శార్దూ
లవరాజినమందుం గా, రవముగఁ గూర్చుండియున్న ♦ రమణీ
యతమున్॥

సీ॥ బహురత్న భూషణ♦భ్రాజితామరసుతా
హస్తచామర సేవ♦లందువాని
వామాఙ్కపర్యఙ్క♦వాసశోభితమహీ
ధర రాజకన్యతోఁ♦దనరువాని
గంధసింధురశిరః♦క్రాంచవిదారణ
యుగ్మమధ్యస్థుఁడై♦యుండువాని
నందీశపాలిత♦నానాప్రమధవీర
గణనాథకోటులఁ♦గాంచువాని

తే-గీ॥ హరివిరించిప్రముఖనిఖి♦లామరేశ
విరచితప్రిస్తుతులఁ బేర్మి ♦ వినెడువాని
సకలహాటకగర్భాండ♦చక్రనివహ
పట్టభద్రేశ్వరుండయి ♦ పరగువాని

ఉ॥ చందురురేకతో మిగుల♦జానగు కెంజెడలొప్పువాని భూ
తిం దమి దేహ మెల్లెడలఁ ♦ దీర్చినవానిఁ గడిందిపాఁపతే
నిందగు జందెమట్టుహవ♦ఁంచినవానిఁ గృపాకటాక్షముల్
పొందుగ భక్తరాజిపయి ♦ బూన్చెడువాని మహామహేశ్వరుఁ॥

క॥ కని తద్విభుపదవనజము, లను మస్తముసోఁక మ్రొక్కి ♦ లలితవిపంచీ
ఘనతంత్రీతతి మీటుచుఁ, గనదుద్యద్గీతనుతినిఁ♦గావించె నిటుల్॥

ఉమావృత్తము:—

కరిముఖజనకా ♦ కరుణాలోకా!
సురుచిరచరితా ♦ సురసంగీతా!
శరవణజగురూ ♦ శరభృన్మేరూ!
పరివృతగిరిజా ♦ పర మోత్తేజా!

తే-గీ॥ అని యిటుల గానమొనరించి ♦ యార్యఁగాంచి
హస్తములు మోడ్చి ప్రాలి జో♦హారుచేసి
సామజాననగుహులను ♦ సన్నుతించి
తక్కుప్రమథేశ్వరులకు స♦త్కార మొసఁగి॥

తే-గీ॥ మరల వీనెమిాటు♦మానితల్లజుఁ గాంచి
యంచితోక్తి నిట్లు ♦ హరుఁడు పలికె
దేవమాని! యిటకు ♦ దిగితి వెందుననుండి
చిత్రవార్త లెవ్వి ♦ చెప్పు మింకను॥

వ॥ అని యొకమణిపీఠిఁ గూర్చుండ నియోగించి నంతనతండం దాసీనుండై యిట్లనియె.

—: నారదముని శివునకుఁ గాంచి లోని శివద్వేషంబుఁ జెప్పుట :—

క॥ సర్వజ్ఞులరగు మిారెది, యుర్వీసదృష్టమగు నిర్జ♦రోజ్వల! నాపైఁ
బర్వెడువాత్సల్యసుధా, నిర్వాహావ్యూహ తేద్ధ♦నియతి యిదికనన్॥

వ॥ ఐన నడిగితిరి కావున మనవిచేసికొని యెద నవధరింపుఁ డెల్లలోకంబు లందెను చరించుచు నొక్క నాఁడు.

శా॥ దేవా! యేమని తెల్పువాఁడను ధరి♦త్రీభాగమందున్నత
శ్రీవిస్తారవిరాజితంబయినకాం♦చీపట్టణంబేగి యా
యావైచిత్రుల నెల్లఁజూచుతఱి పె♦ల్లానేవ మొక్కుండు చే
తోవీథిన్ మథియింపఁగా మరలి యిం♦దున్ జేరితిన్ మిాదరిన్॥

క॥ అన "నేమియద్ది వేగిర, మునఁ దెలుపుము వినెద దివ్య♦ముని!" యనుచుకదున్, వినయమతో డుతనిట్లని, యెనుగరములు మొగిచి దేవ♦ఋషి తానంతన్॥

శా॥ చోళాధీశుఁడు నీదుభక్తుఁడు రుచుల్ ♦శోభిల్ల నీపూజనే
వేళన్ జేయుచు నీదుభక్తతతికిన్ ♦ బ్రీతిన్ బూసంగింపఁగా
నాళీకాక్షమతుండు యామునసుధీ♦నాధుండు విచ్చేసి శై
వాళిన్ దత్సభ గెల్చి వైష్ణవమత♦వ్యామోహముఁ జేసెన్ నృపున్॥

ఆ-వె॥ అంత నానృపుండు ♦ హరమతంబును బాసి
పాంచరాత్రజనులఁ ♦ బజ్జఁజేర్చి
తన్మతానుబద్ధ♦తాత్పర్యమయుఁ డయి
శైవజనుల దవ్వు ♦ సాగనంపె॥

వ॥ మఱియు

ఉ॥ దేశమునందు నెల్లెడల ♦ దేవుఁడనన్ హరియే సమస్తమా
కేశవునిచ్చచేఁబొదలుఁ ♦ గేశవుఁడే పరతత్త్వ మెందునన్
శ్రీశునిఁగొల్చునమ్మతమె ♦ యిథ్య మసథ్యము భిన్నమంచు నా
దేశముచేసె నేఁడటులె ♦ దిద్దిరి శ్రీతిరుచూర్ణ మెల్లరున్॥

వ॥ ఇఁకనక్కాంచీపురంబందు.

సీ॥ వెలిబూది గనుపట్ట ♦ వెలికిఁజిమ్మఁబె కాని
పెరటనేనియు నుంప ♦ నేఁచు జనము
శివరాత్రిఁబస్తేరు♦చేసిన నెఱిఁగి వా
రలపేరు లధికార్లు ♦ వ్రాయుచుందు
రేకామ్రపతిగుడి ♦ కేగువారల నేదొ
సాకుతో నారెకుల్ ♦ సాగనీరు
"ఒకలింగఁడుడిగిన♦నుడిగినట్ట"ని కూట
రాయిమ్రింగును బాంచ♦రాత్రిజనము

తే-గీ॥ బిల్వవృక్షములకుఁబన్ను♦వేయఁజూతు
రంగశిలయందు రుద్రాక్ష♦లమ్ము టరుదు
శైవులెవ రేనిఁ దల్పేమఁ♦జన నడలుదు
రెలమి శ్రీవైష్ణవులకూట♦మేపుమిగిలె॥

ఉ॥ ఏకరసాలనేతవయి ♦ యెప్పుడుఁదత్పురిఁబాయకుండునీ
వే కనుమందువన్నియు నిఁ♦కెందును నేనియు నీదుదృష్టికిన్
రాక యొకండురాజిలునె ♦ రాజకిరీట!వినోదబుద్ధి న
ప్పోకడఁ గొన్నినాళ్ళటులఁ ♦ బోవఁగఁజేయఁ దలంచి తున్నతిన్॥

చ॥ ఇఁకను, విలంబ మొందక మ♦హేశ్వర!యొక్కని ధీరతల్లజున్
బ్రకటితశైవశాస్త్రసువి♦భాషితభూషితవాగ్ధురంధరున్
సకలకలావిశారదునిఁ ♦ జక్కనఁ జోళమహీశ్వరాగ్రణీ
నికటముఁ జేర్చి వైష్ణవుల ♦ నిర్జితులన్ బొనరింపు మింపుగన్॥

ఉ॥ ఆ నరనేత కాత్మకలి♦తాధికవైకృతి నెల్లఁబాపి త
న్మానసమందు నీపదస♦మంచితభక్తి ననుగ్రహింపు స్వ
స్థానపాలందుఁ బూర్వమటు ♦ శైవపిదగ్రణులన్ ఘటింపు సు
శ్రీనిజవైజయధ్వజవి♦చిత్రితమున్ గొనరింపు! తద్భవిన్॥

చ॥ అనుటయు నేఁతనవ్వు మొగ♦మందుదయింపఁగ లోకశంకరుం
డనె ముని! యిట్టిపట్టుదల ♦ నాత్మమునందు వహించి నేటికే
యనువుననైన భూజనను ♦ లారసి భక్తినిఁజెంది దైవపూ
జను గొనరించుచుండుటయు ♦ చక్కనిమార్గముగాదె యారయన్॥

మ॥ ననుఁ బూజించిననెట్టులో యటువలెన్ ♦ నారాయణున్ గొల్చినన్
వనజాతాప్తునిఁ బూజచేసినను మ♦ద్వామాంగి నార్యన్ భజిం
చిన హేరంబుని సేవచేసినను వా♦సిన్ గూర్చు శ్రేయంబు లిం
దనుమానంబొకయింత లేదరయుమీ ♦ యంభోజజన్మోద్భవా!॥

క॥ ఇఁక నన్నుఁగాని మత్పూ, జకరాజినిఁగాని మేటి♦సంభావనతో
నొకఁ డారాధించినవే, లొకఁ డటుమానినను బూన♦ను దేరిక
మెదన్॥

వ॥ అనుడు నారదమునీంద్రుండు చిన్నవోయినమొగంబుతోఁ గరం
బులు మొగిడ్చి మరల నిట్లనియె.

చ॥ అనఘచరిత్ర! నీమదికి ♦ నంతయునొప్పిదమైన మాదృశుల్
గని యెటులైనఁ జాలుదురు ♦ కష్టముగాదొకో, శాంభవాగ్రణుల్
మనములఁబొక్కుచున్ దమదు♦మందిరసీమలఁబాసి లాతినే
దినులకుఁ జేరఁబోయి యటఁ ♦ గీరనిచింతఁ గృశించుచుండుటల్॥

ఆ-వె॥ నిత్యవైభవముల ♦ నెగడుచుండినభవ
దాయతనములందు ♦ నకట యొకఁడు
గానుపింపఁ డట్టి♦కష్టపుపాటున
కోర్వ నోర్వ దీని♦నుడుపు మభవ॥

ఉ॥ భక్తులమానసంబులను ♦ బల్మెలు రంజిలఁజేయుచుండు వా
యుక్తినిఁబాయఁగాఁదగునె ♦ యొప్పునె! సాధుశరణ్య! వేగ మేల్

శక్తిగలట్టియొక్కని వి♦శాంపతిగోష్ఠికిఁ జేరఁబంపి సు
వ్యక్తిఁ దదీయధీరజన♦వాదమహాస్త్ర మొనర్పఁజేయుమా॥

తే-గీ॥ మఱియుఁ దమనుఁడిచొప్పునన్ ♦ మనుజనాథుఁ
డితరదైవంబులను గొల్చు♦టిష్టపడఁడుఁ
గాని శైవమతంబును ♦ గంటగించి
యంత మొందింపఁ గను మంత్రు♦లసుమ కాటు॥

చ॥ అని యిటులొక్కతీరు హృద♦యంబుగరంగఁగ వేడుచున్న న
మ్మునికులవర్యుఁ జూచి శశి♦భూషణుఁ డిట్టులఁ బల్కె నట్లె నా
యనుచరముఖ్యు నొక్కనిని గ♦ణంబునఁ బ్రాడ్విప్ర జనింపఁ జేతు న
య్యనఘుఁడె దిద్దు సర్వము మ♦హాశమునీ! చనుమిఁక సంతసంబునన్॥

క॥ అని పల్కి మహాకాళుం, డనుప్రమథేశ్వరునిఁ జూచి ♦ యంతిక దేశం
బును జేరఁబిలిచి యిట్లనె, ఘనమకరందరసమధుర♦కాంతతరోక్తిన్॥

చ॥ వినుము కుమార! నీవు పృథి♦వీస్థలిఁ గాంచి జనించి సత్వరం
బనితరతుల్యతాగరిమ ♦ నద్భుతలబ్ధసమస్త వేద శా
స్త్రనిచయపాండితీసువిహి♦తప్రతిభన్ బ్రతివాదివాదభం
జన మొనరించి యాత్మమత♦సౌరభముల్ వెలయింపు మెల్లెడన్॥

ఉ॥ నావుడు నప్డు వేగ వద♦నంబున దైన్యముఁ జెంది యిట్లనెన్
దేవ! యిదేల? తావకస♦దేశమునందు మహాప్రమోదలీ
లావిలసత్సుఖైకరస♦లాలసమానసవృత్తి నున్న న
న్నీ విపుడిట్లు దవ్వులకు ♦ నెట్టుట కెట్టులనోర్తు నేనికన్

తే-గీ॥ నన్నుడిగి వేఱొకనిఁ బంపు ♦ నాథ! నీదు
పాదకమలాశ్రయంబు నేఁ ♦ బాయఁజాల
పరుఁడనై నొకొ యేటికీ♦పాటు నాకు
మనుజయోని జనించుట ♦ మంచిదొక్కొ

—: శివుఁడు మహాకాలుని భూమిఁబుట్టుట కొప్పించుట :—

క॥ అనుడు నగి దేవనాథుం, డనియె సమర్థుండవౌట ♦ నారసి నిన్నే
పనుపఁగఁగోరితి లాతులఁ, బనిచిన సామాన్యజనుల ♦ ఫలమేమి
యగున్॥

ఉ॥ ఏకరసాలనాఘుఁడను నెంతయుఁ బిలుపగు హరితోడ నే
నాకటకంబుఁ బాయక యహర్నిశముల్ వసియింతుఁ గావునన్
నీకు మదీయదర్శనము నిత్యముగా నొనఁగూడు నేటికీ
ఏ కరణిన్ వెనుంబడెద విద్ధచరిత్ర! తలంపు నానుడిన్॥

శా॥ భూలోకం బదికర్మభూమి యచటన్ బాలొప్పఁ బుణ్యాంబులన్
లోలాత్మన్ బొనరించినన్ సుఖము లీలోకంబులన్ గాంతు రా
శ్రీలాలిత్యవిభూతి గల్గునె? యిటన్ జిత్తంబునన్ గాంచు! నీ
లీలన్ వెల్గఁగఁ జేయు భూమిపయిఁ బల్వీకన్ గులోద్ధారకా!

చ॥ మఱియును మర్త్యజాతి నను మానవుమాని యెటుల్ జనింతు నం
చతిముఖీ నెంచఁబోకు భవదర్థము నేని దెపంపువాఁడ నా
గరితను గంగ నా పెయెడ గర్భము నావలనన్ గ్రహించి క్రి
చ్చఁబఱ జనియింపు పట్టివయి సాఁకెద నిన్ బహుమానవై ఖరిన్॥

—: శివుఁడు గంగాదేవిని భూమింబుట్టి మహాకాళుని గనుమనుట :—

క॥ అని యంతనె గంగను గనుఁ
గొని యిట్లనె దేవి! నీవు కువలయమందున్
జనియింపవలయు నచోటన్
వననిధియంశజుఁడొకండు వరియించు నినున్॥

క॥ పరిణయ మాడినతోడనె
కరమరుదుగ నతఁడుసురుగుఁ గాలవశత నే
డ్తెఱ నీవు శైశవాదిగ
ధరియింతువు నాదుభక్తిఁ దద్దయు మదిలోన్॥

తే-గీ॥ వాఙ్మనసవృత్తి నాయందవారితముగ
వెలయఁజేసెదు వంత నీతలఁపెఱింగి
కరుణతో నీకు గర్భంబుఁ గాఁగఁ గూర్తు
నిమ్మహాకాలుఁ డిఁక జనియించు నీకు॥

క॥ కొలఁదిదినంబులు మాత్రము
కులబంధులతోడఁ బొత్తుగొదవై యొదవన్

గల దంతనె సుతుఁడునిన్
విలసద్బహుమానగతిని ♦ వెలయించుఁ బ్రియా!

ఉ॥ నావుడు దివ్యగంగ యనె♦నాథ!యి దేటివినోద మేను మీ
పావనసన్నిధానమును ♦ బాసి భువిన్ జనియించు టందునన్
గావలుఁడైన యొక్కనికిఁ ♦ గైఁబడి యన్నరుఁగోలుపోయి నిం
దావహమైనచూలుఁగొని ♦ యాత్మజునొందుట యుక్తమౌనొకో॥

తే-గీ॥ ఏటికీపాట్లు నాకు నే♦నెంతయేని
దోసమొనరించితినొ యేమొ ♦ తోఁచ దగ్రి
రాజ్ఞి పన్నినయట్టితం♦త్రంబొ నాదు
భాగధేయమొ తమకిట్టి♦భావ మొదవె॥

చ॥ అకట మహాత్మ!నీదుహృద♦యంబున కర్హనుగాక యున్నఁదా
వకకరుణాపరిసార మది ♦ పట్టపురాణినై నున్ననైన నీ
చకితను దాసి గానయిన ♦ సన్నిధినుంపఁదలంపు దేవ!యా
ర్యకుఁదమకుంబొనస్తు నిసె♦యంజలులన్ దలఁపందునొందుచున్॥

వ॥ అని పెల్లుగవందురుచున్ననమ్మందాకినిన్ గనుంగొని మహేశ్వ
రుండు మందహాసంబుఁ గావింపుచు నపవారితంబుగ నిట్లనియె.

మ॥ పరిశుద్ధాత్మకవంశమ బ్రాణములనున్ ♦ బ్రాణంబువంచున్ గిరీ
శ్వరజన్ మించినదానవంచుఁ దమి శీ♦ర్షంబందు నిన్బొందనో
సరి నీకెందొకచెల్వగల్గునొ దిశా♦చక్రంబు గాలించినన్
మెఱుగుంబోడి! మఱుంగ దేటిక సము♦న్మీలద్దృషాక్రాంతతన్।

చ॥ నను విడి చాలఁగాలము మ♦నంబున వందురుచుండుటందు నీ
కొనరదు స్వల్పకాలమున♦కోపుము కష్టము సౌఖ్యమో యికన్
వనితసకృష్టమైనపెం♦వాఁడు మగండగునంచు నెంచపే
వనధియే భువింబోవమి ♦ వచ్చి వివాహమునొంది క్రమందడున్॥

చ॥ అదియును బాల్యమందె యగు♦నావ్యసనంబును నిన్నుఁగన్నవా
రెద నణగింపకొందురిక♦నీయది తోయఁగరానికార్యమై
నది తడనంగనేటికది ♦ నాతుకమిన్నరో!నీవు నాపయిన్
జెదరఁగనీక చిత్తమును ♦ జేర్తువు పిన్నటనాఁటనుండియున్॥

క॥ ఒకమన్వంతరమున నా
సకలధునీరాజరాజు ♦ సాగరవరుఁడా
త్మకు నాయకుఁడని యెఱుఁగుము
చకితవుగా కిట్టియుచిత ♦ సరణికి దేవీ॥

తే-గీ॥ ఆ సముద్రుండునుఁ మదీ♦యాప్తతనువు
లందు నొకఁడగుతనుమాత్రుఁ♦డంచు నెఱుఁగు
మన్యుఁడని యెంచఁబోకుమీ ♦ యాత్మమందు
ననుచితాధ్వమఁగూర్తునే ♦ యకట నీకు॥

శా॥ ఏకామేశ్వరుఁడన్ననామమున నే♦నెప్పాటఁ దద్రాజధా
నీకమ్రాయతనంబునం దమరుదుఁ ♦ నిన్నేమఱన్ నాదుసే
వాకౌతూహలసంభ్రమభ్రమదనౌ♦పమ్యానురాగాత్మవౌ
నీకుఁ గూర్చెద మత్ప్రసాదము సుతుఁ ♦ నీరేజపత్రేక్షణా॥

ఉ॥ సతులకు భర్తృశాసనము ♦ సమ్మతిమై నెఱవేర్చు టెంతయుఁ
హితమగు దానిఁబోవిడిచి ♦ యెన్నివ్రతంబులు నెన్నిపూజలుఁ
సత మొనరించుచున్నను బ్రి♦శస్తిని జెందదు హర్షమీదు ప్రో
న్నతమతి! నీవెఱుంగనివె ♦ న్యాయవచస్సముదాయధోరణుల్॥

క॥ కావున నఱమఱసేయక
నీవిఁకఁ గాంచీపురమున ♦ నిశితవ్రతుఁడౌ
శ్రీవైష్ణవునకు సుతవై
కావింపుము జన్మమరసి ♦ కంజాతముఖీ॥

క॥ అనుడు నిశితవ్రతుండగు
ఘనవైష్ణవునకుఁ బొడమినఁ ♦ గానఁగనగునే
మనసిజహర! నీపదభ
క్తిని వారలుసాగనీరు ♦ ద్వేషింతు రెటుల్॥

క॥ అనుటయు నంబరవాహిని
కనియెను శశిమౌళి యద్ది ♦ యనవసరమునీ
కెనలేనిభక్తి నాపై
నొనరును బిఱుతివియఁబోకు ♦ ముత్పలనేత్రా! ॥

ఉ॥ ఎప్పుడుగాని యెవ్వరికి నేనియు నెవ్విధమైనపూన్కియున్
దప్పక యొండెదుర్కొనిన దార్ఢ్యమునొందును డింద దింతయున్
దప్పనొకో నిసర్గజని తాంతమనోగతు లడ్డగించుచో
నొప్పులకుప్ప!నానుడికి నొప్పము చెప్పను మన్యసూక్తులన్॥ 95

క॥ మందాకిని విని యిట్లుఁ
దనకుందప్పదు పుట్టుఁగనుట కష్టలి యని తాఁ
గుందక యె యాత్మమానస
ముందిటమునొనర్చియుండెఁ బొంకమువిూఱన్॥

తే-గీ॥ అమ్మహాకాలుఁడును దన యవతరణమా
నకును గంగను భువనశాసకుఁడు వసుధ
కనుప సెలవిచ్చుటయు నాపె యాత్మఁగొంకె
యెట్టకేలకుఁ జిత్తంబు గట్టిచేసి॥

తే-గీ॥ ఒప్పుటయుఁ గని తానిఁక నుర్వి జన్మ
మొందుటది యనివార్యమం చూహ చేసి
పుడమిఁగాంచుచు నిలిచిన భోగిభూష
ణుం డిటులఁబల్కె నాతని నొగులుదీఱ్ప॥

ఉ॥ కంటికి తెప్పవోలె నినుఁ గాంచుచునుందుఁ గుమార!కూరిమిన్
దంటవు నీవు వేగముగ ధాత్రిజనించి యనాత్మవాదులౌ
కంటకులన్ దగన్ గెలిచి ఖ్యాతిగ నాత్మమతంబు నిల్పి!సి
స్నంటవు మేదినీగత నిరంతరపంకపరంపరావృతుల్॥

తే-గీ॥ అనుడు నాతఁడు శిరమున నంజలిన్ఘ
టించి దేవ!ప్రసాద మట్లె యొనర్తు
నశివసామాజికాళిజయంబుఁ గాంతు
శివమతధ్వజమున్ బ్రతిష్ఠింతు ధరను॥

చ॥ అనుటయు దేవనాథుఁడు "తథాస్తు"న [illegible] నిఁకన్
జనుమా మునీంద్ర!నీవిటనుఁ జక్క[illegible]చ్చు [illegible] మెంతయున్
మనసుకు నచ్చినట్లొనర మానిన [illegible]ల్యలమానసంబునొం
దిన నెదిచక్కగాదు జగతిన్ జతురాస్యపదైకభూమిఁ !॥

వ॥ అనినంత నారదుండు సంతుష్టుండై పరమేశ్వరీపరమేశ్వరచరణార విందంబులకెరగి తనయానంబుని వేదించుడుఁ బరమేశ్వరి ముసిముసి నగవుతో నారదుఁ దిలకించి.

తే–గీ॥ ఏదివచ్చిన నామీఁది ♦ కేగుదెంచుఁ
గాంచితివెకాదె మౌని!గం♦గమ్మగతులు
ఊరకుండెడువారల♦కుపకృతులివె
మొత్తుదురు లోకమందెప్డు ♦ మెత్తవారి॥

వ॥ అనిన మందహాసంబుసేయుచు నారదుండుచనియె నంత మహేశ్వ రాదేశంబునఁ బేరోలగంబు విరమింపఁబడియె.

—: ఆశ్వాసాంతము :—

క॥ సకలకమలోద్భవాండ
పరికరోద్భవహేతుమూర్తి!♦పాలితనానా
సుకవీశ్వరనికురంబా!
చకితామరదుఃఖహరణ♦చణ!మల్లేశా! ॥ 105

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితసుకవితాభాగధేయ బుధ జనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయవిరచితంబైన హరదత్తవిజయకావ్యంబందుఁ బ్రథమాశ్వాసము శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# హరదత్తవిజయము

## ద్వితీయాశ్వాసము

క॥ శ్రీశైలరాజ్యలక్ష్మీ, కౌశల్యసమన్వితాభి♦గణ్యాసుసేవా
ప్రాశస్త్యమోదితాత్మా!, శ్రీశశితానందనిజస♦చివ!మల్లేశా! ॥

వ॥ దేవా!అవధరింపుము.

శా॥ చంచత్కాంచనభిత్తిసంకలితభా♦స్వద్బుధ్నరత్నావళీ
సంచిత్రాయతసప్తభూమివిలస♦త్సౌధోత్తమస్తోమర
మ్యాంచత్తుంగతరాభ్రచుంబనపటు♦ప్రాకారవిస్తారమై
కాంచీపట్టణ మొండు భాసిలు జగ♦త్కల్యాణపల్యాణమై॥ 2

క॥ ఆపురము ఘనతపశ్శ్రీ, ప్రాపితమః క్ష్మాంగనాని♦వాసవిభాస్వ
ద్గోపురము కామకోటి, శ్రీపీఠాధిష్ఠితంబు ♦ శేఖర మిలకున్॥

సీ॥ ఏకరసాలనా♦ధేచ్ఛాపరిసాదిత
విజ్ఞానవిద్యుతి♦విలసితంబు
అతులకామాక్షీమ♦హాకృపాప్రాపితా
ప్తైశ్వర్యభోగ్యభా♦గ్యాయతనము
పరివార దేవతా♦ప్రకరాభిరక్షిత
సకలదిఙ్మండలీ♦చారుతరము
సమధిక యోగిరా♦జన్యచయానన్య
సామాన్యసిద్ధివై♦శద్యపదము

తే-గీ॥ అభ్రగంగాకృపీటతు♦ల్యానఘాచ్ఛ
సలిలపుష్కరిణీగణ♦చారుకూల

బహువిధఫలద్రుమస్తోమ♦భరితలలిత
సకలపుష్పలతావ్రాత♦సమధిగతము॥

తే–గీ॥ పుణ్యజనసేవితంబయి ♦ పొదలుగాని
మానవాశనతతికి వే♦శ్మంబునీదు
భోగివర్గనివాసమై ♦ రాగిలెడును
గాని దుర్విషధరవృతిఁ ♦ గాంచ దెపుడు॥

తే–గీ॥ సప్తమోక్షైకనగరప్ర♦శస్త మిద్ది
యంచుఁ గాంచియె కాంచి నే♦కామ్రవిభుఁడు
వరదరాట్టును బ్రత్యేక♦వసతు లొంది
యుండిరని వృద్ధజను లను♦చుందు రెపుడు॥

క॥ నారులలోపల రంభా
నారీమణిపోల్కిని నభి♦నంద్యశ్రీఁ జె
న్నారునగరులందుఁ గడున్
సౌరుందగుఁగాంచి యనుచు♦ సాటుదురు ప్రజల్॥

ఉ॥ అందలి విప్రు లెల్లఁ జతు♦రాస్యులు రాజులు రాము లార్యజా
తిందగువారు శ్రీదులు మ♦తిన్ గణియింపరు శూద్రు లేబలున్
గ్రిందికినీఁదికిన్ దిగిచి ♦ గెల్తురు నారదు నందు గాయకుల్
క్రిందుగఁ గావ్యునిన్ విబుధ♦కంటకు మెచ్చరు సత్కవీశ్వరుల్॥

క॥ కరులైరావణవిస్మయ
కరులు మహావైరిభీతి♦కరు లన్నగరిన్
హరు లిఁక భాస్కరహరిరుచి
హరులు హరులు సమరభూమి ♦ నద్భుతమొదవన్॥

వ॥ అందు

తే–గీ॥ వరదరాణ్మూర్తి రాజిల్లు ♦ వాడ నెపుడు
విష్ణుకంచి యటంచును ♦ బిలుచు జనము
తక్కినట్టిపురంబు నం♦తయును గరిమ
మమర శివకంచియని సాటు ♦ నఖిలజనము॥

## —: శ్రీవిష్ణుచిత్తాచార్యచరిత్రము :—

తే-గీ॥ విష్ణుకంచి వసింతురు ♦ వేలకొలఁది
విత్తముల్ వైష్ణవోత్తముల్ ♦ విమలచరితు
లందు బేర్కొను గందాళె ♦ యన్వయమున
ఘనుఁడు విష్ణుచిత్తార్యుం డ♦కశ్మలుండు॥

క॥ ఆయన కిరువురుతనయు ల
మేయులు లక్ష్మణబుధుం డ♦మితతర్కవచ
స్స్థేయుఁడు శఠగోపార్యుఁడు
నై యలరుదు రిద్ధమూర్తు ♦ లభినుతచరితుల్॥

క॥ శివశాసనమున గంగా
కువలయదళనేత్ర యంతఁ ♦ గోవిదవరవై
ష్ణవవిష్ణుచిత్తునకుఁ దా
నవతారముచేసెఁ గూఁతు♦రై యొప్పమరన్॥

తే-గీ॥ కరగిపోసినయట్టి చొ♦క్కమగుబంగ
రంపుబొమ్మయనాఁ దగి ♦ రాణమీఱు
మేని మేలిమికాంతుల ♦ మెఱయుచున్న
బాల బాస్వత్కళాజాల ♦ భవ్యలీల॥

క॥ ఆకన్య కష్టమాబ్దం, బాకర్షితమగుడు నప్పుడె ♦ యనురూపవర
శ్రీకలితన్ జేసి రయం, బే కల్యాణంబుసేయ♦నెంచెఁ బిత మదిన్॥

వ॥ ఆయమపుట్టువునకుఁ గొంతపూర్వంబందే.

చ॥ శివవచనంబునన్ దనకు ♦ సిద్ధముగా సెలవౌటనెంచి య
ర్ణవుఁ డొకయూర వైష్ణవగు♦ణజ్ఞసుతుండయిపుట్టి వేదశా
స్త్రవిహితదర్శనంబులను ♦ బ్రౌడినిఁ జెందుడు తల్లిదండ్రులం
త విగతజీవులైరి తద♦నంతరముల్ నెరవేర్చె నాతఁడున్॥

తే-గీ॥ అంత నతఁ డొకవత్సరం ♦ బైనపిదపఁ
దీర్ఘయాత్రాభిలాషియై ♦ తివిరి సకల

పుణ్యభూములఁ గనుఁగొంచు ♦ మోక్షపురుల
సిరులమీఱిన కాంచికిఁ ♦ జేరె మీఱి॥

ఆ-వె॥ వచ్చి విష్ణుకంచి ♦ వైష్ణవాగ్రగణులయా
వసథములను విందుఁ ♦ బడయుచుండె
విష్ణుచిత్తుఁ డతని ♦ వేఁగని గోత్రసూ
త్రముల సంప్రదాయ♦తత్త్వ మరసి॥

వ॥ అష్టావింశద్వత్సరంబులప్రాయంబునను న్న యవ్వైష్ణవకుమారుని రూపరేఖాదులకు సంతుష్టుండై నిజబంధులఁ బత్నీపుత్రుల నాలోచించి యవ్వారియనుమతంబున నొక్కసుముహూర్తంబునందుఁ దన కూఁతునబ్బాలునకిచ్చి కన్యాదానంబుచేసి వివాహంబు నెరపె నంతమీఁద దైవేచ్ఛఁజేసి యనూనతనవరుండు.

క॥ ఒకమధ్యందినమందున
నొకతీర్థహ్రదముఁ జేరి ♦ యుత్సాహముతో
నొకఁడవగాహనమొందఁగ
మకరమొకం డాడిసి చేర్చె ♦ మకరాలయముౕ॥

వ॥ అంత నతండు మరల సముద్రుండై యొప్పె నిందు విష్ణుచిత్తాదులు జామాతృమరణంబునకు ఘోరదుఃఖాతురులై విలపించి యుత్తర క్రియలనిర్వర్తించి రాబాలిక వైధవ్యంబునొందియుం బాల్యప్రాయంబుకతంబున శోకం బెఱుంగక పెరుఁగుచుండె.

తే-గీ॥ కమలకోమల యని నామ♦కరణదినము
నాఁడు తలిదండ్రు లెంతో యా♦నందమునను
బేరుపెట్టుట నట్టులే ♦వెలసె నాపె
గాఢసౌగంధ్యసుందర♦కాంతు లమర॥

తే-గీ॥ తెలివితేటలు దైవభ♦క్తి గురుభక్తి
యును సమానోదరప్రేమ ♦ మున్నతమతి
పారిశుద్ధ్యము సౌశీల్య♦భాగ్య మాకె
కమరె సహజంబులై ♦ యవయవములట్లు॥

తే-గీ॥ ఆయమను గాంచి లోలోన ♦ నాపుకొనుచు
వందురుదురు గురులు హితుల్ ♦ బంధుగులును
వత్సరంబులుపది దాటె ♦ బాల కపుడు
లోకవిజ్ఞాన మదికొంత ♦ శోకమొసఁగె॥

వ॥ అంతఁ గొన్నినాళ్ళ కాయమకు యౌవనంబొదవె నాపై న
ప్పూఁబోఁడియును.

ఉ॥ అప్పు డొకింతదుఃఖమును ♦ నారసియున్ దనపూర్వజన్మపుం
దెప్పరమైన తేజ మదిఁ ♦ దేల్చినఁ జిత్తముగట్టిచేసి తా
నెప్పటియట్టులుండె నిఁక ♦ నెంతయు ప్రాక్తనవాసనాత్మయై
యొప్పులకుప్ప శాంభవమ♦తోత్సుకయై చెలువొందు నిచ్చలున్॥

వ॥ అట్లు సహజశివభక్తిపరాయణయైనను దనవారల భయంబున
మఱుగుగావించుచుండె నాబాలారత్నంబు.

:— కమలకోమల శివభక్తి సేయుట :—

సీ॥ తనువెల్ల భసితంబుఁ ♦ దాఁ బూయునెంచియు
నతిగోప్యముగ వక్ష♦మందె యలఁదు
శివనామ మెపుడును ♦ జింతనం బొనరించుఁ
బెఱ కక్కరంబేని ♦ వినఁగరాదు
శివకంచి కెదురుగాఁ ♦ జేతులు జోడించి
నిలుచుండి నిట్టూర్పు ♦ నిగుడఁజేయు
శివరాత్రి యమర న♦జీర్ణమయ్యెనటంచుఁ
బస్తుండు సుంతసా♦పడదలఁపదు

తే-గీ॥ శివునియుత్సవములు దవ్వుఁ ♦ జెలఁగుచుండ
నిక్కినిక్కి కనుచునుండు ♦ నిష్ఠమీఱి
భజనములు మేళములు వినఁ♦బడినయపుడు
తన్మయత్వంబుఁజెందుఁ బ♦ద్మదళనయన॥ 28

మ॥ అపురూపంబుగ నెన్నఁడేని యును న♦య్యబ్ధంబునందుండి శ్రీ
ద్వీపశైలంబున కేఁగువారియెడ నెం♦తే భూతిరుద్రాక్షలిం
పు పిసాళింప ధరించినట్టి ద్విజు న♦ప్పాఁబోఁడి వీక్షించి చో
క్కపుభక్తిన్ బ్రణమిల్లు శ్రీఫల మొసన్ ♦ గన్పట్టినన్ మ్రొక్కెడున్॥

తే-గీ॥ గంగియెద్దులఁ దోడ్కొని ♦ కాసు లడిగి
జీవనముసేయు వారలు ♦ చేరి దఱియ
హరునివారువములని యా♦హ్లాద మొంది
బిచ్చ మేదేని యర్పించి ♦ ప్రీతి సేయు॥

క॥ తమసురభులు మొగదూడల
నమరికఁగన నుదితవిస్త♦రామోదమునన్
గమల యనుక్షణమును శ్లే
మము సంధానించుచుండు ♦ మహితప్రేమన్॥

తే-గీ॥ ఇట్లు శివధర్మసేవనా♦ధీనయగుచు
నున్నఁ దల్లికిఁ దండ్రికి ♦ నన్నలకును
బంధువుల కెవ్వరికిని నే♦ర్పడఁగనీక
భక్తిసేయుచునుండె న♦భవునియందు॥

వ॥ అంత దినదినప్రవర్ధమానం బగుచున్నన పారమేశ్వరకైంకర్య
లోభాయత్తాత్యాచారమతిన్ బ్రచోదితయై యొక్కనాఁ డాశీల
వతీవతంసం బిరుగుపొరుగిండ్లనున్న స్మార్తబ్రాహ్మణస్త్రీణము
కార్తికేందువాసరంబగుటఁ బ్రదోషంబం దర్చనావస్తువుల సమ
కూర్చుకొని శివకంచికేకామేశ్వరాలయంబున కేఁగుచుండుటఁగని
తానునుగూడఁ దదనుగమనాభిలాషిణియై తల్లిదండ్రులసెలవడిగిన
నవ్వా రక్కజంబొంది మిక్కిలికినుకతో నమ్మానిని కిట్లనిరి.

మ॥ తగునే యల్లరిపిల్లవైతి వెటులీ ♦ తాత్పర్యమున్ జెందితో
సి! గురుద్రోహిణి! రుద్రమందిరములన్ ♦ జేరంగ నౌనే కటా
నగరే! భూజను లోర్తురే! హితులు భూ♦నాథుండు మాన్యంబుఁ దా
నెగబెట్టండె! వెలిన్ బొనర్పరె! మహా♦హేంద్రప్రభుల్ వైష్ణవుల్॥34

తే-గీ॥ ఎట్లు నోటికివచ్చె నీ ♦ కెవరుచేసి
రిట్టిదుర్బోధ చెట్ట యే♦దేని వచ్చు

నొక్కొ! చెట్టు చెడెడునాఁడు ♦ కుక్క మూతి
పిందెలొందు ననెడునుడి ♦ విందుముగద॥

వ॥ అనిన దీనాననయై యమ్మానిని నిజజననీజనకుల కిట్లనియె.

క॥ మీ రగ్నులఁ బూజింపరొ
వారిరుహాప్తప్రముఖన♦వగ్రహపూజల్
గూరిమిఁ జేయరొ! దిగధిప
వారార్చ నొనర్పనట్టి♦వారో యరయన్॥

వ॥ మఱియు హోమంబునందు గంధర్వు లప్సరోజనంబులు మున్నగు వారలకు హవ్యంబు లిచ్చుచుండుట లేదా?

క॥ పారమ్యము మన దేవున
కే రంజిలుఁగాతమింక ♦ నితరసురలఁ దా
మూరక సేవించిన నది
నేరం బగునొక్కొ! యరయ ♦ నేర్తురు మీరల్॥

వ॥ అనుడు విష్ణుచిత్తుం డిట్లనియె.

తే-గీ॥ పెద్దపులి వచ్చి తఱిమిన ♦ బెంగనొందుగ
నైనను శివాలయంబున ♦ కరుగరాదు
మనమతాచార మిద్ది కు♦మారి! మాఱు
మాటలాడకు వేఱొక♦బాట సొరకు॥

తే-గీ॥ అనుచు నుండఁగ భ్రాతృద్వ♦యము దఱియుడు
నపుడు జనకుండు వారల ♦ కాస్వరూప
మంతయు నివేదన మొనర్ప ♦ నం దవరుఁడు
బిట్టలుక పండ్లగొఱుకుచు ♦ నిట్టులనియె॥

చ॥ ఎవ రుపదేశమిచ్చి రిటు ♦ హేయపుబుద్ధి జనించె నెట్లు? నీ
కవినయశాలినీ! కులము ♦ నంతయు గంగను గూల్పనెంచితే
అవునిది కాదనా నెఱుఁగ♦వైతివి మూర్ఖవు చెడ్డత్రోవలోఁ
దవిలితి వింక నీ కుదక♦తర్పణముల్ బొనరింప యుక్తమా॥

తే-గీ॥ చేరి పాషండు లెవ రేని ♦ వేసిరొక్కొ
యిట్టిదుర్బోధ నెట్లు స♦హింతు నేను

ఉజకయుందునె!బోద్ధల ♦ గురుతెటింగి
యంత మొందిపనే! వారి ♦ నవలనిన్ను॥

అ-వె॥ అని నృసింహమూర్తి♦యై పరుపాతురం
బులను వెడలఁగ్రక్కి ♦ పొగలుచుండ
జ్యేష్ఠు డంత నోర్మి♦జెంది యనుజు సన్న
చేసి యాపె నతని♦చిందు లపుడు॥

వ॥ అంత శరగోపార్యసధర్మిణి వారలఁ దారసించి.

చ॥ మొగమున బూదిరేకలు స♦ముల్లసదక్షసరం బురంబునం
దగుపడ నొక్కవృద్ధుఁడగు ♦ నగ్రకులుం డిభశైల మేఁగుచుం
డఁగఁగని యీయెమెంతయు దృ♦ఢంబుగహస్తములెత్తిమ్రొక్కెనూ
టిగఁ గనుఁగొంటి నేనని వ♦డిఁ దెలిపెఁ దనమామ కత్తఱి॥

వ॥ వెండియు నాకెయిట్లనియె.

ఉ॥ తోటకు నెప్పుడేనిఁ జనఁ ♦ దోరపుఁగూరిమి బిల్వభూజ మె
చ్చోటను నున్నతా వరసి♦సొంపగునచ్చోటుచేరి మ్రొక్కి యు
ల్లాటపుహర్ష మొందు శితి♦కంఠకథాగతలీల లెవ్వరేఁ
బాటలుపాడఁగా నలరి ♦ భక్తివినంగ మనంబు నొందెడుఁ॥

తే-గీ॥ అనుడు నెట్టెట్టు తెల్పవే♦మనియె నాప
మగఁడు తత్పిత లక్కటా ♦ మంచియుమఁకె
నేమిసేయుద మిప్పాట ♦ నీమెననిరి
నగుచు వారించె జ్యేష్ఠుఁ డం♦దఱను నపుడు॥

తే-గీ॥ కమలకోమల తనవారి ♦ కర్కశోక్తి
జాలమున కెంతయేఁ మది ♦ జాలినొంది
సర్వమును నీశ్వరేచ్ఛచే ♦ నిర్వహిల్లు
ననెడు ధైర్యంబుతోడ నుం♦డెను దనంత॥

—: విష్ణుచిత్తుండుకూతునకువైష్ణవధర్మంబులఁజెప్పుట :—

వ॥ అంత నొక్కనాఁడు శ్రీవిష్ణుచిత్తాచార్యుండు కూతుం గూర్చుండఁ బెట్టుకొనియిట్లు మతధర్మంబు లుపన్యసించె.

ఉ॥ శ్రీహరిభక్తులన్ హరినిఁ ♦ జిత్తమునన్ దలపోయుచుండు మె
ప్పౌ హరముఖ్యదైవముల ♦ నాత్మమునన్ జొరనీకుమింకన
వ్యాహతి ద్రావిడోరునిగ♦మాంచితదివ్యనిబంధనోక్తులన్
నీహృదయంబునన్ నిలిపి ♦ నేరిమి పేరిమి జెందు!సద్గతిన్॥

క॥ ఏకాదశ్యుపవాసం
బేకమతిన్ జేయుచుండు ♦ మెప్పొందు పుణ్యా
శ్లోకాంచితభాగవత
శ్రీకథలను నాలకింపు ♦ చేతం బలరన్॥

క॥ జన్మాష్టమి రామనవమి
సన్మానమతిన్ వ్రతములు ♦ సల్పఁగవలయున్
జన్మములు దరించు జగ
జ్జన్మాదినిదానుఁడైన ♦ చక్రధరుకృపన్॥

క॥ తులసియు సాలగ్రామము
విలసత్పద్మాక్షసరము ♦ విష్ణుకులుఁడు ప్రో
ల్లలదష్టాక్షరి తిరుమణి
యిలలోఁ దులలేని వనుచు ♦ నెఱుఁగుము పుత్రీ! ॥

క॥ నాకము భోగపరంపర
నాక రమేశ్వరునియం ద♦నారతము మనం
బేకముగనిలిపి పూజన
మేకాలము సేయవలయు ♦ నిది పరమమమా! ॥

క॥ భాగవతము రామాయణ
మాగారుడ పాద్మములును ♦ నలవిష్ణుపురా
ణాగమము పాంచరాత్రము
లే గమ్యములమ్మ!మనల ♦ కిది నమ్ముమెదన్॥

క॥ విను!శ్రీయు దేవహూతియు
వనచారిణిశబరి రాధ ♦ వైదర్భియుఁ బా
వనజనిద్రోవది కుబ్జయుఁ
గనిరి హరిని భక్తిచేసి ♦ కనుమీవటులే॥

-: కమలకోమల శివభక్తినిఁ బెంపుసేయుట :-

చ॥ జనకుఁడు పూన్కిమైసిరులఁ ◆ జక్కఁగ వైష్ణవధర్మవృత్తముం
దనకు హితంబుగానుడువఁ ◆ దామరసానన గోడపోల్కిఁ దా
విని వినకున్నయట్టులు ప◆విత్రనిజాత్మముఁ జేర్ప కెంతయే
ననువుగఁ గొల్చుచుండె శశి◆రాద్రిసుతాహృదయేశ్వరాంఘ్రులన్॥

మ॥ పనులేవేని నొనర్చుచున్నయపుడున్ ◆ బ్రాల్మాలియున్నప్డు భో
జనమున్ జేయుచునున్నయప్పుడును ని◆శ్శంకాత్మయై తావసిం
చినయప్డున్ శయనంబునొందినపుడున్ ◆ జిత్తంబు గౌరీశప
ద్వనజాతార్చనకన్న వేఱయినదే◆భావంబు లే దాకెకున్॥

క॥ అపుడిపుడననేటికి వే
తెపుడును నాయమ్మచేత ◆ మెడపక సర్వే
శపదారవిందయుగళీ
విపులధ్యానాన్వితమయి ◆ విలసిలుచుండున్॥

వ॥ ఇవ్విధంబునఁ గొంతకాలంబు జరిగినమీఁద నాయుత్తమ చిత్తంబు
నందు.

ఉ॥ ఎన్నఁడు నేనిఁగల్గునొకో ◆ యేకరసాలమహీరుహేశ్వరా
భ్యున్నతదర్శనం బికను ◆ నొందఁగలానొకో నాదుజన్మమం
దెన్నఁడు నేని తత్పదన◆శేద్ధతరామృతపానభాగ్యసం
పన్నతఁ దత్ప్రసాదపరి◆పాకలవోత్తమసంగ్రహంబునున్॥

సీ॥ కనులార! యెపుడేనిఁ ◆ గనుగొందు రామీరు
శివకాంచికానాథు ◆ శ్రీపదముల
వీనులారా! యెపు◆డేని విందురె మీరు
శ్రీశివధ్యానప్ర◆సిద్ధఘోష
మంఘ్రులారా! యెపు◆డైన మీర్నడతురే
బాలరసాలరా◆డ్భవనమునకు
కరములారా! మీరు ◆ గాంతురే యెపుడైన
నతులకామాక్షీశ్వ◆రార్చనంబు

తే-గీ॥ నాసికా! కల్గునొక్కొ యె♦న్నండు నేని
నీకిఁకను నేకసహకార♦నేత్రచరణ
వికసదరవిందవరగంధ♦విసరమాక
రందరసభోగబంధురా♦నందమహము॥

-: ఏకామ్రేశ్వరబ్రహ్మోత్సవము :-

తే-గీ॥ అనుచు నువ్విళులూరుచు ♦ నాత్మయందు
నెపుడు భావనసేయుచు ♦ నిగురుఁబోఁడి
యోర్మిఁ బ్రొద్దులుగడుప బ్ర♦హ్మోత్సవంబు
దఱిసె నేకామ్రపతికి నం♦తట రయమున॥

తే-గీ॥ వరుసఁ బంచాహపద్ధతి ♦ వైభవముగఁ
బరఁగుచుండెను బ్రహ్మోత్స♦వంబు శివున
కర్థిమైఁ జూడ నరుదెంచి ♦ రద్భుతముగ
వివిధరాష్ట్రవసీప్రజల్ ♦ వేనవేలు॥

ఉ॥ వైణికగాయకుల్ మఱియు ♦ వైదికపాఠవిశారదుల్ బుధుల్
రాణఁదలిర్చు పణ్యకుల♦రాజముఖుల్ ధనశాలులున్ దరి
ద్రాణులు సర్వవస్తుసము♦దాయమహాక్రయవిక్రయోరుజ
శ్రేణులు సత్కవీంద్రులును ♦ జిత్రకలాఢ్యులు వచ్చి రత్తఱిన్॥

క॥ అప్పటిచోళవిభున కది
చెప్పరముగ నోర్వరాని♦తెవులైన నిఁకన్
దప్పక నానాదేశ్యుల
యొప్పమిచే జరుగుచుండె ♦ నున్నతగతిమై॥

తే-గీ॥ అంకురార్పణ దేవతా♦హ్వానములును
నగ్నిసంస్థాపనంబు క♦ల్యాణమహము
నందిసేవ సదఃస్ఫూజ♦నంబు వరుస
జరిగెను రథోత్సవంబిఁక ♦ జరుగనుండె॥

— రథోత్సవము :—

వ॥ ఆ రథోత్సవ మేటేటఁ గాంచీనగరరాజవీధులందు నిర్విశంకంబుగ ననాదికాలంబునుండి జరుగుచుండు టాచారంబుకతన విష్ణుకంచీ చతుష్పథంబునుండి కంచి శివక్షేత్రాంగం బాహ్యహంబున నడచుచుండుటఁజేసి వైష్ణవులెల్లరును ద్వారంబులకుఁ దాళంబులుబిగించి తేఁపకడనఁ బొరుగూరులకుఁ బోయి మఱునాఁటిసాయం బిలుఁజేరి వీధిచతుష్పథం బపవిత్రంబయ్యెనని ద్రావిడమంత్రంబులఁజదువుచుఁ గుశోదకంబున మార్జనంబునొనర్చుచుందు రద్దాన వర్తమానాబ్దం బందలి మహోత్సవపూర్వదినచరమయామంబున నవ్వారెల్లఁ బూర్వాచారప్రకారంబిండ్లకు బీగంబులువేసి ప్రాంతగ్రామంబుల కేఁగిరి విష్ణుచిత్తార్యుండును సకుటుంబముగఁ గావిష్ణుండైనఁ గమలకోమల యవ్వారికిట్లనియె.

తే-గీ॥ నాయనా! సేయుఁడీ ప్రయా♦ణంబు మీరు
నాదు దేహ మిది బలహీ♦నతను జెంది
యున్నయది యింటియొద్దనే ♦ యుండుదాన
నడువఁగానోప దవ్వగు♦ నెడకు వడకు॥

క॥ ఇంట నివసించి కాచెద
నింటిని వస్తువులఁ బసులఁ ♦ నేమరకయ మీ
రింటికి వచ్చుసరికి నే
వంటకమునుజేసి యుంచి ♦ వర్తింతుఁ దగన్॥

తే-గీ॥ అనవుడును నానుడినిఁ దండ్రి ♦ యాలకించి
యందు నున్నట్టిసౌకర్య ♦ మరసి మఱియు
నలిగియున్నట్టితనయ చం♦దంబుఁ గాంచి
యాపె సౌశీల్య మెఱిఁగియు♦న్నట్టికతన॥

తే-గీ॥ ఉనుచుటకు సమ్మతించి ర♦థోత్సవంబు
వేళ కాపె చతుష్పథ♦వీధిఁ జేరి
శివుని దర్శించునొకో యను♦చిత్తమునను
జూడవలదని శపథంబు♦లాడి చనిరి॥

వ॥ అంత నవ్వైష్ణవకృశోదరి తనవారెల్లఁ బొరుగూరికిఁ దఱలుటయు నింటికెలంకులఁగూడ శ్రీవైష్ణవజనంబులెల్లరును నల్లెలేకుండుటయు నేకసహకారేశ్వరుండు మఱునాఁటి ద్వితీయప్రహరంబునఁ దమవీధిచతుష్పథంబునకు రథారూఢుండై వచ్చుటయును నారసి పరితోషంబున నా యుత్తరక్షణంబునుండి గృహంబును వస్త్రంబులను శుద్ధిగావించికొని దవ్వులనుండు పూజాపరికరంబుల దాసీద్వారంబునఁ దెప్పించి సర్వంబు సమకూర్చుకొని యన్నిశాచతుర్థయామంబునన మేల్కొని గవ్యక్షీరపుష్పబిల్వాదుల సంధానించి స్నానమాడి శుద్ధదుకూలాంబరంబులఁగట్టి విభూతిం బెట్టి యర్చనాపదార్థంబులన్నియు వేఱువేఱుగిండ్లయం దమర్చి యుంచె.

—. కమలకోమల పూజావస్తువులతో శివరథంబుఁ జేరుట :—

ఆ-వె॥ ఆవుపాలు పెరుఁగు ♦ హైయంగవీనంబు
మధువు చక్కెరయును ♦ మంచిసలిల
ములును నారికేళములును ♦ మోచాగోస్త
నీఫలములు రజత♦నిభవిభూతి॥

ఆ-వె॥ చందనాక్షతములు ♦ శతపత్రరాజముల్
బిల్వదళము లగరు♦వర్తు లాజ్య
సిక్తవర్తు లుదక♦సిక్తముద్గములు పా
నకము వీడియమ్ము♦లు కపురంబు॥

వ॥ మఱియు సువర్ణదక్షిణంబులును బూర్వోక్తభంగిఁ బ్రత్యేకపాత్రంబులం దమర్చి వానినన్నిటిని నొక్కవిశాలభాజనంబునఁ జేర్చి దినప్రథమయామాంతంబున గృహద్వారప్రదేశంబున నివసించి శివస్యందనాగమనంబునకై నిరీక్షించుచుండె నంత ద్వితీయయామాంతిమ నాడీసమయంబునందు.

శా॥ గప్ర్యుత్థిస్థలికన్న వెన్కనె శతాం♦గంబున్న భేర్యాదిక
శాస్త్రవ్యాఖ్యానములుల్ మహాజనచయో♦ద్యద్ఘోషముల్ వేదవి

ద్భవ్యామ్నాయపదక్రమాదివిహితస్వస్తిప్రపాఠోన్నతుల్
నవ్యశ్రీకమనీయవారవనితాలాస్యప్రసంగధ్వనుల్॥

తే-గీ॥ బహులకోలాహలంబుగఁ బరిఢవిల్లి
దిఙ్ముఖంబులనొంద నా దివ్యవికచ
కంజలోచన దిక్కులఁ గలయఁజూచు
చుండె నెంతయుసంతోష మొప్పమీఱ॥

తే-గీ॥ అంతకంతకు నిర్ఘోష మతిశయిల్లె
వేయు వేయుగ వాద్యముల్ వినఁగనయ్యె
జనులు గుంపులుగుంపులై సాగుచుండి
రాంధ్రు పురుషులు వృద్ధులు నర్భకులును॥

వ॥ అంతమీఁద.

తే-గీ॥ షట్వాది- వరుసతోడుతఁ బటహడమరుకములును
కాహళంబులు భేరీలు ఘంటికలును
వేణువీణామృదంగనిస్సాణములును
ఝల్లరీఘటగోముఖశంఖములును
వాదనం బొనరించుచు వచ్చుచుండె
రెలమి మూఁకలు మూఁకలై హెచ్చుగాను॥

క॥ సానాయివాద్యమునఁ బే
రెన్నికగలవారు పాట లెసఁగించుచు న
త్యున్నతి వచ్చుచునుండిరి
కన్నార్పక చూచుచుండెఁ గమల సకలముఁ॥

క॥ మఱియును జామరధరులును
బరగ సితచ్ఛత్రధరులు ధ్వజపటధరులుఁ
వరనృత్తచతురగణికా
తరుణు లరుగుదెంచి రెంతొ తత్పరమతులై॥

వ॥ అనంతర మామ్నాయవాదు లరుదెంచుచుండిరి.

తే-గీ॥ సంహితను జెప్పుచును నొకశతము బుధులు
పదముఁ గ్రమము జటాఘనపాఠములను

నాకౌకశతంబు విబుధులు ♦ చక్కఁదీర్చి
స్వస్తిఁ జెప్పుచు వచ్చిరి ♦ సంతసమున॥

క॥ జయజయనాదంబులతో
నయుతప్రజ లిరుగెలఁకుల ♦ నమరికఁ దేరున్
రయమున లాగుచువచ్చిరి
వియదవనీతలము లెల్ల ♦ వెలయ నినదముల్॥ 84

క॥ తేరిఁ కిరుగడల భాస్కర
వారిరుహారాతిబింబ♦వైభవ మమరం
గా రహినిఁ బగటిదీపము
లారతు లొనరించుచుండె ♦ నచలములగుచున్॥ 85

క॥ ఆమ్రదళతోరణంబులు
క్రమసుగంధసుమమాలి♦కావితతులు సిం
పై మ్రోయుగంటలును నే
కామేశరథంబునందు ♦ నసుపట్టెఁ దగన్॥ 86

తే-గీ॥ తేరిమధ్యగృహంబున దే♦దీప్యమాన
కాంతిమండలముగఁ దోఁచె ♦ క్షణ మనంత
రమున విగ్రహములుగఁ ద్రి♦కముగ వరుస
శివుఁడు కామాక్షి గంగ గా ♦ నవుటఁ దెలిసె॥ 87

చ॥ పలిపవుపైడిపట్టువలు♦వల్ మృగనాభివిభాసితంబులౌ
తిలకము లాణిముత్యముల♦తీరగుహారములున్ మణీసరం
బులు నవరత్నసంచయవి♦భూషితచారుకిరీటకుండలం
బులు మొదలౌనగల్ మిగులఁ ♦ బొందుగఁ గన్పడె వారలందునన్॥

తే-గీ॥ ఇంపుమై సైన్యనేత చం♦డేశ్వరుండు
ప్రభులమున్ముందు నెలకొని ♦ పరఘవముగ
సర్వమును బరికింపుచు ♦ సర్వహాణము
సల్పుచున్నయటుల్ దోఁచె ♦ సమధికగతి॥ 89

తే-గీ॥ అల చతుష్పథమధ్యమం♦దా రథంబు
నిలిచె నత్తఱి భక్తకో♦టులు దమంత

నర్చనావస్తుసంతతు ♦ లపుడు దెచ్చి
యర్పణముసేయుచుండి ర♦త్యంతభక్తి॥ 90

వ॥ అయ్యవసరంబున.

క॥ ఆ వైష్ణవసీమంతిని
దా వీక్షించియు గరిష్ఠ♦తరభక్తిశ్రీ
ప్రావీణ్యోన్నతి రథమున్
వేవేగన్ జేరె వస్తు♦వితతులతోడన్॥

క॥ తేరికి నించుక యెడగాఁ
జేరి యటన్ బళ్ళెరమును ♦ జేఁగొని నిలువం
గా రహిం హృదయము దృష్టులు
గోరాజకలాపునందుఁ ♦ గుదురుకొనెఁ దగన్॥ 92

మత్తకోకిల॥ బాలచంద్రకలాకలాపవి♦భాసితాంఘ్రియుగంబునం
దా లతాంగి మనం బహంకృతి ♦ యైదుజ్ఞానహృషీకముల్
లోలుపస్థితిఁ జెంది యుండె య♦లోకహర్షమునొందుచున్
మేలుగా నివసింప నంతనె ♦ మేదినీసురుఁడొక్కఁడున్॥

ఉ॥ ఆ యమ దోయిలింగల ప♦దార్థపుభాజనమున్ గ్రహించి యా
కాయజుజేత కంత నొడి♦కమ్మన నర్పణచేసి యారతిన్
వేయిడి తత్ప్రసాదపరి♦వేష్టితపాత్రము నామెకిచ్చి తాఁ
బోయెఁ దనంత నంతఁ బువుఁ♦బోఁడి మహేశ్వరుఁ జూచుచుండియున్॥

తే-గీ॥ పరమశివభక్తిపరిపాక♦భాగ్యగరిమ
శర్వకైంకర్యలగ్ననిశ్చలమనమునఁ
దన్మయత్వంబుఁ జెంది ని♦తాంతపార
వశ్యమునఁ జెలువొందె న♦భవునికరుణ॥ 95

వ॥ అంత స్యందనంబు గదిలి జనంబుతో దూరంపుమేర కేగినయం
తను నాసాధ్వీలలామం బందేయుండి యంతఁ గొండొకస్మృతితో
గేహంబుఁ జేరి శివప్రసాదం బొక్కించుక చేకొని మొక్కి సార

భంబులాని పారణంబొనరించి గృహద్వారంబుల లోన బంధించి యొక్కదర్భాస్తరణంబునఁబరుండి చేతం బేకామేశ్వరసేవానులంబై యుండ నిదురించియుండుడు.

—: కమలకోమలకు స్వప్నమందు శివసాక్షాత్కారము :—

ఉ॥ నారదమౌనితోడ నల♦నాఁడు మహేశ్వరుఁ డాడినట్టియు
బ్భారతినైఖరిన్ దలఁచి ♦ పన్నగనన్నుడిఁబూర్తిసేయఁగాఁ
దా రహి నెంచ వైష్ణవసు♦ధాకరవక్త్రికు నొక్కస్వప్నపుం
దీరమరన్ విచిత్రనియ♦తీపరికల్పితరీతి నిట్టులన్॥

తే-గీ॥ తరుణచంద్రకలాపుఁ డ♦ద్ధామమొంది
వైష్ణవతలోదరిని నిద్రఁ♦బాపి తార
సించి కడుగారవించి ప్రే♦మించి యంచి
తాదృతిననుగ్రహించి తా♦నరిగె మరల॥

క॥ అంతనె యాయమ మేల్కొని
యంతటఁ దాఁ గలయఁజూచి ♦ యక్కజపడి య
త్యంతముచింతిలి సిగ్గిలి
యెంతయునున్ భయముఁజెంది ♦ యిట్టులనుకొనెన్॥ 99

చ॥ కలయిదిగాదు నిక్కలయె ♦ ఖండహిమాంశుధరుండు వచ్చి నా
కెలనవసించి ప్రేముడినిఁ ♦ గేల్కొని యట్టులనుగ్రహించి తా
నెలవునుజేరె ద్వారములు ♦ నేటుగ బంధములొంది యుండుటన్
గలయనఁజెల్లదొక్క మా♦కాండున కీయది వింతచేష్టయే॥

చ॥ కొలువకపోతిఁ బాదములఁ ♦ గూరిమినొత్తకపోతిఁ జామరం
బుల సురటీల నేనియును ♦ బొందుగఁజేకొని వీవనైతిఁ దం
డులపరిపక్వ మన్నమును ♦ దుష్టిగ సాపడఁజేయనైతిఁ గ
శ్మలమతినైతి సుంతయున ♦ సత్కృతిసేయకయుంటె నక్కటా॥

వ॥ కొంతతడ విట్లుచింతించి మఱియు నిట్లుయోజించె.

తే-గీ॥ ఇద్ది నిజమైననున్ మఱి ♦ యెట్టిస్వప్న
మైననున్ దీనిపరిణామ ♦ మమరుటెట్లొ

తల్లిదండ్రులు నన్న లే తలఁపు చెందు
వారలో! కలఁ డన్నిటఁ బరమశివుఁడు॥

తే-గీ॥ అని మదిన్ దిటమొనరించి గారామొ యప్పుడు
శివుని నైవేద్య మంతఁ భుజించి పాత్ర
ములను బూర్వప్రకారంబు సిలిపి ప్రొద్దు
వ్రాలుటనుజూచి తమవారు వత్తురనియు॥ 103

క॥ వంటకము చేసి చక్కఁగ
నింటిబహిర్ద్వారదేశ మీక్షించుచు వా
రింటికిఁ జేరి మురిసి మి
న్నంటి భుజించిరి రసనల కభిరుచులొదవన్॥

ఆశ్వాసాంతము

క॥ భ్రమరాంబికామనోబ్జ
భ్రమరాయితమూర్తి! యమరవారక్షేమో
ద్యమసంప్రవృత్త! కరుణా
కమనీయవరప్రదానఘన! మల్లేశా! ॥

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితసుకవితాభాగధేయ బుధజనవిధేయ మాదిగొండనాగలింగేశ్వరనామధేయవిరచితంబైన హరదత్తవిజయకావ్యంబునందు ద్వితీయాశ్వాసము—

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# హరదత్తవిజయము

## తృతీయాశ్వాసము

క॥ శ్రీవాణీహృదయేశ్వర
సేవావిలసితచరణకు♦శేశయయుగళీ
భావజజయవైభవను
శ్రీవహచారుతరమూర్తి! శ్రీమల్లేశా! ॥

వ॥ దేవా! అవధరింపుము.

–కమలకోమల గర్భావస్థ తల్లిమున్నగువారెఱుంగుట:–

ఉ॥ బాలశశాంకమౌళి యిటు ♦ వైష్ణవయోష ననుగ్రహించుడున్
గాలహరానుశాసనముఁ ♦ గాంచినయట్టికతంబునన్ మహా
కాలుఁడు వేగ నాయునతి ♦ గర్భమునొందె ననంతరంబె ప్రో
యాలికిఁ దప్పిపోయె నెల ♦ యంతనె యేర్పడె గర్భచిహ్నముల్॥

ఉ॥ తల్లియెఱింగె నాపయినిఁ ♦ దామునెఱింగిరి యన్నలాండ్రు నా
హల్లకపాణియున్ హృదయ♦మందు గ్రహించెను దండ్రియన్నలున్
దెల్లముగాఁగ నారసిరి ♦ తేటపడెన్ గులబంధుకోటికిన్
బెల్లుగ వాడయంతటను ♦ బేర్కొనఁగాఁబడె నిందితంబుగా॥ 3

తే–గీ॥ ఎట్టిపాపంబు నెఱుఁగని♦యిగురుఁబోఁడి
కిట్టి బెట్టిదపుంబాట్లు ♦ గట్టి మేటి
వేడ్కఁగనుచుండె నేకామ్ర♦విభుఁ డదేమొ
కో! వినోదం బితరులకు ♦ గురుతుగాదు॥ 4

వ॥ అంతఁ దల్లియును వదినెలు మేనయత్తలు మున్నగువారు రహస్య ముగ నమ్మత్తకాశినిని నిర్బంధించి యడుగుటయు నాపె యుత్త రంబీక తనకేమియుఁ దెలియదనియు సర్వంబున కీశ్వరుండే కార ణంబనియు నొడివి యూరకుండె. మఱియును గొలదిదినంబు లట్లే జరిగినంత మూఁడవమాసం బతిక్రమించె. గర్భంబు క్రమక్రమంబుగ వృద్ధిఁజెంది యందఱకు సాధారణంబుగఁ దోఁచుచుండె నంతఁ గులవృద్ధులును బంధువు లవ్వారిమందిరంబున కరుదెంచి యనుచి తంబని నిశ్చయించి యాయమను ద్యాగంబుసేయ నిర్ణయించి రందు మఱికొందఱు ధూర్తలామెనుబిలిచి యథార్థంబు సెప్పు మనియునుఁ జెప్పకున్న శిక్షింతుమనియును వేధించుచు నాసాధ్వీ రత్నంబు మాఱువల్కక హృదయంబునంది శ్రీశ్వరునిఁ బ్రార్థించు చుండె. 5

కవిరాజవిరాజితము

అమలకృపాకలి♦తాత్మక! దేవవ♦రాభయదానమ♦హాచతురా!
కమలదళాంబక♦కంజసహస్రని♦కామసమ ర్వాణ♦గాఢరతా!
సమధికవిక్రమ♦సారభుజోన్నత♦చండమహాసుర♦చక్రహరా!
శమనమదాహృతి♦శక్తబలిష్ఠభు♦జాయుతమూర్తిప్ర♦సన్నమతీ॥

వ॥ అని యోజించుచుండ నవ్వారలు

క॥ చెవిటివలె మూగవలెఁ బి
చ్చివలెఁదివలె వెఱ్ఱిఁగొన్న ♦ చానవిధమునన్
లవమైనను నోరెత్తక
మివులన్ జింతనముసేయు ♦ మెలఁతఁ గని కడున్॥ 7

తే-గీ॥ కినిసి "ముంజేతికంకణం♦బునకు నద్ద"
మేటి కిఁకదీని శిక్షించి ♦ యీపురంబు
వెడలఁదోలియుట హితమని ♦ నుడివి యినుప
కట్టులనుగాల్చి యాకెమొ♦గంబునందు॥ 8

## -: కమలకోమలను వైష్ణవులు బాధించుట :-

క॥ వాతలను బెట్ట దొరకొని
రాతతకోపాగ్నితాపి ♦ తాంతఃకరణో
ద్భూతరయంబున జ్యేష్ఠ
భ్రాత గనుంగొని యదెల్ల ♦ భావమునందున్॥ 9

చ॥ కటకట! యెట్టులోర్తు నిటు ♦ గాదిలిచెల్లెను గాల్చుచుండఁగాఁ
గటికలు వీరలందఱును ♦ గాదన మానుదురెట్లు? సుంతయేన్
గుటిలత చెల్లెయందు నొనఁ♦గూడుట యెప్పుడుఁ జూడ నిద్ది యి
ద్దిటుల విషంబువోలె జని♦యించె మహావ్యసనైకబీజమై॥ 10

సీ॥ పరులెకా కేలాటి ♦ పురుషులతో నెట్టి
పల్కుఁ బల్కని యట్టి ♦ భవ్యశీల
ఇరుగుపొరుగువారి ♦ యిండ్లకేనియుఁ జన
గడపదాఁటని యట్టి ♦ గణ్యచరిత
మానంబుఁబాసి యే ♦ మగువలతోఁగాని
ముచ్చటల్ వెట్టని ♦ పుణ్యమూర్తి
స్నానంబు భోజన♦సలిలగ్రహము వినా
విడెమేసి గోరని ♦ విమలహృదయ

తే-గీ॥ అన్యముఖవీక్షణంబును ♦ నన్యకథల
నాలకించుటయును లేని ♦ యకలుషమతి
చెడ్డనడతల కెట్టుల ♦ సిద్ధమయ్యె
దైవమే కారణము వేఱు ♦ దలఁప నిందు॥ 11

వ॥ అనుచు నతం డాసన్నిధినుండి యవలకుఁ జనియెనంతఁ జనకుండు నిజాంతరంగంబునందు.

ఉ॥ ఎవ్వనితోడ నేన్ దుహిత ♦ యెన్నఁడు దా నొకపల్కుఁ బల్కఁగా
నెవ్వరమైనఁ గాన మిది ♦ యెట్లొనఁగూడెను మాదుమందిరం
బెవ్వఁడు చేరరాఁడు చనఁ ♦ డెప్పుడునేనియుఁ గూఁతు రేడకే
నెవ్విధినైనఁబోవ దిది ♦ యెట్లుపొసంగెఁ గరంబువింతగాన్॥ 13

వ॥ మఱియు నించుక యోజించి.

తే–గీ॥ శివరథోత్సవాహమ్మునఁ ♦ జిగురుఁబోడి
దేహ మస్వస్థమైయుండ ♦ దీమువిడిచి
రాకయుండెను గ్రామాంత♦రంబు నాఁడు
దోస మేదేని యొదవిన♦దో యెఱుఁగము॥ 14

తే–గీ॥ అట్టు లేదేనియును బాప ♦ మమరెనేని
యంతతోఁ బోవునోకో ♦ యెపైన నొకఁడు
దారసింపఁడో! రాఁడో! యీ♦తన్విజాడ
కెటుల యోజింపరా దిది ♦ యేమి తెరువో॥ 15

వ॥ ♦ మేమేది యెఱుంగకున్న నిప్పటి వఱకు బంధువు లాత్మీయులు పెఱవార లిరుగుపొరుగువార లెవ్వరేనియుగాని యీయమను గూర్చి యొక్కింతేనిఁ బదరుట వినఁబడలేదు.

ఆ–వె॥ వాని నిక్కచూచె ♦ వీనిఁ జూచి హసించె
నతఁడు నీపె యెటకో ♦ యరిగి రనుచుఁ
బరుషవచనములను ♦ బల్కకుందురె? నేఁడు
పేక్షు చేసినారె? ♦ పేర్మిఁజూపి॥ 17

వ॥ సర్వంబునకుఁ బెరుమాళ్ళే శరణంబని యాచక్కిఁబాసి వేఱొక చోటికిఁ బోయె నిఁకమాతయుఁ గూతుర్గాంచియులదురుచు.

తే–గీ॥ అభము శుభము నెఱుంగని ♦ యన్న కిప్పు
డెట్లొయిటు దాపరించె నీ♦యేవ మకట
కలజు లిద్దాని బాధింపఁ ♦ గుంటువడరు
నెవలికన్నీరు ♦ వేటకా♦నికి భరంబె!

వ॥ అనుచు నపూర్వ్యంబుఁ బాసిపోయెనంత
ద్వితీయ సోదరుండిట్లనుకొనియె,

ఉ॥ ఏయపచార మేనియును ♦ నీపె యొనర్పకయున్న నెట్టులీ
హేయత దాపరిల్లు నిది ♦ యెంతయు గర్హ్యముకాదె! చెల్లెయం

చాయతవత్సలత్వమును ♦ నారయఁ జెల్లునె? వంగడంబు నిం
దాయుతమైనచో మృతియె ♦ తద్దయుమే లనవచ్చు నిమ్మహిన్॥

వ॥ అనంతరం బాపెవదినె లిట్లనుకొనిరి.

తే-గీ॥ మేము వచ్చినదాదిగా ♦ నీమె యెట్టి
దుడుకుచేతలతో దిగఁ♦బడక యుండె
రుద్రసేవానిరతిదక్క ♦ రూఢిగాను
గనము కనమెండు దురిత మీ♦గర్భ మెట్లొ! ॥

వ॥ అంత నావీరవైష్ణవాగ్రేసరులు.

తే-గీ॥ ఏటికి విలంబ మింకను ♦ నిపుడె యీపెఁ
బట్టి యొకమున వాతలఁ ♦ బెట్టి యూరు
వెడలఁగొట్టుదమని కడు♦వేగిరముగ
నాయమను జుట్టి కాల్ప నా♦యత్తపడుడు॥

వ॥ తల్లిదండ్రులు సోదరతత్పత్నులును జూడలేక యావలకుంబోయిన నంత నాయుత్తమ యపుడు దిక్కులేకయున్న తనకు సర్వేశ్వ రుండే దిక్కని మనంబున నిట్లు యోజించె.

కరుణావృత్తము॥ దరిసెన మొసఁగుమా! ♦ దండధరహరా!
కరుణను మనుపుమా! ♦ కాలవిషహరా!
బిరబిర వరుసతో ♦ భీమ! యిఁకను నా
సరసకు దఱిసి వే ♦ సాకు పశుపతీ!

శివప్రియవృత్తము॥ ఏకామ్రరాణ్మహేశ!
శ్రీకాంచికాపురీశ!
లోకాధిరాణ్మహేశ!
శ్రీకామదృక్సతీశ!

### శివుఁడు కమలకోమల ననుగ్రహించి వైష్ణవబాధలఁ దప్పించుట.

తే-గీ॥ అంత నేకామ్రనాధుఁ డా♦యింతిచంద
మరసి కరుణాంతరంగుఁడై ♦ యాత్మశూల
మునను గఱ్ఱులఁ ద్రోయఁగ ♦ వెనుక కేఁగి
వారిహస్తములనె కాల్చె♦వరుసతోడ॥

వ॥ అంత నవ్వార లేడ్చుచు.

క॥ కుయ్యో మొఱ్ఱో యిది పెను
దయ్యమొ భూతంబొ మనల ♦ దహియించె నిటుల్
కొయ్య యిది యెట్టులగుఁ గా
కియ్యెడఁ బోవుదము బ్రతికి ♦ యిండ్లకు మరలన్॥

వ॥ అనుచుఁ గొందఱు వెడలిపోయిరి మఱియును.

తే-గీ॥ కొంద ఱవ్వారవణితనిఁ ♦ గొట్టఁబోయి
నేలఁబడి రిఁకఁగొందఱు ♦ ఱాలరువ్వ
నవ్వి వారలతలలనే ♦ యడిచె నంత
శాపములు పల్కి చనిరంద ♦ ఱేపుమాలి॥

వ॥ తలిదండ్రులు సోదరు లంతఁ గించపడి చేయునదిలేక యామెను గ్రామమునుండి వెడలఁగొట్టిన మరణించునో యింక నేమియే వంబు దాపరిలునోయని యెంచి పాయలేనివాత్సల్యంబునఁగూడ విడనాడలేక తమకదుపులుండెడుగోష్టంబుకడ నామెనునిచి యొక కంచంబిచ్చి శూద్రికుఁబోలె నోదనపానీయవస్త్రంబులిచ్చుచుండి రంత నాసుశీలగూడఁ బ్రాణత్యాగంబు దురితంబని యెంచి యద్దాని మాని వారలయనుమతితో నల్లేవసించి మానసంబందు మహేశ్వరు నారాధించుచుండె.

ఉ॥ గొనకొని రేల నాకమల♦కోమల కడ్డపు డర్ధచంద్రమం
డనుఁడు నగాధిరాజసుత ♦ నాగముఖుండును షణ్ముఖుండునున్
మునులును దేవతల్ ప్రమథ♦ముఖ్యులు స్వప్నమునందుఁజుట్టి త
న్మనములరంగఁ బ్రేమవచ♦నంబులు వల్కుచునుందు రెంతయున్॥

తే-గీ॥ గర్భము క్రమంబుగా వృద్ధిఁ గాంచుచుండెఁ
దల్లితండ్రులు మున్నుగు నెల్లవారు
పలుకరింపఁగ రోసిరి పగను గొనిరి
కొంద ఱంతట నెలలయ్కొదవదీఱె॥

—: హరదత్తాచార్యజననము :—

వ॥ అపుడు పంచాంగశుద్ధిగల యొకశుభదినంబందు.

ఉ॥ ఐదుగ్రహంబు లున్నతగృహంబులనుండఁగ బ్రహ్మదైవతా
రాదిపదంబునందుఁ గమలానఘమూర్తికి శర్మమొప్పఁగా
నాదిమదేవపుత్త్రుఁడు గణాగ్రణి యుదయించె మించె నా
నాదివిషత్ప్రయుక్తసుమనఃప్రకరాయతవృష్టిసంతతుల్॥

క॥ మెఱసెన్ దిక్కులు విరివిగ
విరిఁదేనెల సోనలందు విందుఁగొనిన తే
మ్మెర లనువుమీఱవీచెను
బరితోషం బమరెఁ బాశుపతమండలికిన్॥

తే-గీ॥ పెరటిదెసఁ గాపురంబున్న చరణజకుల
మహిళ లేతెంచి సూతికర్మంబు నంత
నడపి రెంతయు బాలుండు నగుమొగమునఁ
గానుపించె గృహంబెల్లఁ గాంతులమర॥

వ॥ అంత నింటివార లెఱింగియు నెఱుంగని వారలయట్లుండు జోక్యంబుఁగొనకయుండి తమహృదయంబునందు.

క॥ ఏదైననుగానీ మన
కేదియునుం దలఁచుటకు నొకింతపనియునున్
లేదిది బ్రదికినదనుకఁ బ్ర
సాదము వస్త్రంబులను నొసంగుటయె యగున్॥

వ॥ అని యనుకొని యూరకుండిరి.

తే-గీ॥ అంత జరిగె సహస్రత్రయంబు నవల
రాత్రిదశకంబు మాస మారమ్యశీల

జాగరూకతయై కొమరుని ♦ సాఁకుకొనుచు
నుండెఁ దనవారిమనములె♦ట్లున్న నంత

—: హరదత్తుని శైశవము :—

క॥ బాలుండు దినముఁదిన ముడు
పాలకలావహాళికృపను ♦ భాస్వత్తరశో
భాలలితాకృతిఁ బెరుగుచుఁ
జాలగ నలరించుచుండె ♦ జననిని నిచ్చల్॥

క॥ అడుగులు వేయఁగనేర్చెను
వడివడి నడువంగనేర్చెఁ ♦ బరుగిడనేర్చెన్
దడఁబడునుడులను నేర్చెను
బుడిబుడి యాడంగనేర్చె ♦ బుడుతలతోడన్॥

తే-గీ॥ ఆయమను గన్నవారు ము♦న్నెన్నవారు
గొన్నినెల లాకెఁజూడ కే♦గుటనుమాని
రవల యెట్లెట్లొ దవ్వొండి ♦ యరయుచుండి
రర్భకున కేఁగె నాల్గేడు ♦ లావిధముగ॥

వ॥ అంత.

తే-గీ॥ బూది గన్పట్ట నొడలెల్లఁ ♦ బూయుచుండు
కోడెలేగలతో సతం ♦ బాడుచుండుఁ
జెలఁగి శిలలను దెచ్చి పూ♦జింపుచుండు
ప్రాక్తనవివేకవశత న♦బ్బాలకుండు॥

శా॥ ఐదబ్దంబులబాలుఁ డెంతయు దశా♦బ్దాలంకృతుండట్లు మే
ధాదర్పద్యుతిభూరివిక్రమబల♦స్థైర్యాభిరామాకృతి
ప్రాదుర్భావత నొప్పిరాజిలెఁ బ్రసూ♦బంధుల్ పరీక్షించి త
ద్భాదివ్యద్గతి కక్కజంపడి రిఁకన్ ♦ భావంబులం దెంతయున్॥

ఉ॥ అంతటఁ గొన్నినాళ్ళకుఁ ద♦దర్భకుఁ డొక్కపు డీడువాండ్రతో
నెంతయుఁబ్రీతి ఖేలనము ♦ లింపుగఁజేయుచునుండ వారిలో

నంత జనించె దైవవశ♦మై కలహంబొకఁ డందుఁ గశ్మల
స్వాంతుఁడు బాలకుండొకఁడు ♦ చక్కఁగ నీతనిఁ జూచి రుష్టుఁడై॥

తే-గీ॥ వైధవేయుఁడ! యేటికి ♦ వదరెదిట్టు
లనిన నాతఁడు నట్టులే ♦ యనియె నంత
వానితలిదండ్రులకు నద్ది ♦ వాఁడు దెలుప
వారలే తెంచి యాబాలు ♦ దూఱి కసరి॥

శా॥ ఓరీ! నీజనకుండెవండు చెప్పుమా ♦ యుద్రేకముం దక్కి నీ
పేరేమో తెలియంగఁ బల్కు మిటులన్ ♦ భీఁదక్కి వాదాడఁగా
నోరెట్టుల్ గదలించితీవు బడుగా ♦ నొప్పింతు మిప్పింతుమి
ట్లీరజ్జుల్ వచరించెదేని యిపుడే ♦ హింసాప్రహారంబులన్॥

వ॥ అని గర్జించి తఱిమినయంత నామతిమంతుండు మాతనుడాసి యవ్వృత్తాంతంబంతయు నెఱుంగఁ జెప్పి యిట్లనియె.

తే-గీ॥ తండ్రి యెవ్వఁడు నుడువు మా♦తగో! మదీయ
నామమేమొకో వచియింపు ♦ మేమిసంది
యంబు చెందకు మున్నదు♦న్నట్లు సెప్పు
మీగుడిసెయందు వసియించు♦టేలమనకు॥

ఉ॥ చెప్పక దాచితేని నిను ♦ శిశువొనర్చెద నేను నాపయిన్
ముప్పనుగాంతు నట్లయిన ♦ మోదముచెందుదు రన్య లెక్కడా
తిప్ప లిఁకేల సత్యముగ ♦ దేవునియానగఁ జెప్పు మమ్మ! నీ
విప్పుడు సర్వసంశయము ♦ లింకఁగ జంకక సుంతయేనియున్॥

కమలకోమల పుత్రున కేకామ్రనాథుఁడు
నీతండ్రియని చెప్పుట.

తే-గీ॥ అపుడు నామెయు దీనాత్మ♦యై రయమున
గొప్పయిక్కట్టు దఱిసెఁ గా♦కోలహారుఁడు
హారుఁడె తీరుచు సర్వంబు ♦ ననుచు సుతునిఁ
గాంచి యిట్లనిచెప్పె న♦కలుషమతిని॥

ఉ॥ ఏకరసాలనాథుఁడు మ♦హేశుఁడు నీజనకుం డతండు సు
శ్లోకుఁడు సర్వదేవచయ♦శోకహరుండు హరుండు రాక్షసా
స్తోకమహాగ్నిసంశమన♦తోయదమూర్తి సమస్తలోకర
క్షాకరదివ్యవైభవవి♦హారుఁ డెఱుంగుము పుత్రకా! యిఁకన్॥

తే-గీ॥ అట్టిహరునికుమారుఁడ ♦ వౌట నీవు
పరగెదవు హరదత్తుఁడన్ ♦ భాసురాహ్వ
యంబుచే నిందు మనముండు ♦ టగును గొంత
కాల మాపయి యెటకేనిఁ ♦ గదలవచ్చు॥

వ॥ అనిన బాలుండిట్లనియె.

తే-గీ॥ ఏడనుండును మాతండ్రి ♦ యేకచూత
నాథుఁ డెఱుఁగంగఁజెప్పు జ♦ననిరయముగ
నాదుజాడకు రాఁ డేమ♦నాదరంబొ
నీపయినిఁ గోపమో! నాదు♦పాపమొక్కొ?

వ॥ అనినంతఁ గమలకోమల యిట్లనియె.

చ॥ అల శివకాంచినానగర♦హాటకహర్మ్యమనోజ్ఞగేహమం
దలఘుఁడు దా వసించు నతఁ ♦ డందఱియట్టులగాదు పుత్ర! ని
శ్చలహృదయుండు సంతతల♦సత్తరసారతపోభిరాముఁ డా
విలసదనూనయోగపద♦వీపరిభాసితుఁ డిందు వచ్చునే?

చ॥ ఘనుఁడు దయామయుం డఖిల♦కారణకారణమూర్తి లోకపా
వనమహిమాతిశోభితవి♦భాసితపుణ్యకథాప్రపంచమం
డనుఁ డఖిలాబ్జజాండవిత♦తప్రకరాయతమంగళావహుం
డనఘుఁడు ధన్యవైభవుఁ డ♦నన్యవిరాజితశీలుఁ డారయన్॥

చ॥ సనకసనందనాదిముని♦చంద్రములున్ శతపత్రపత్రలో
చనవనజోద్భవాదిసుర♦సత్తములున్ గనఁజాలకుండు రా
యనఘుని దివ్యమంగళమ♦హాద్భుతకోమలవిగ్రహంబు నీ
మనుజులు గాంతురెట్టులు కు♦మార! మదిం దలపోయు మున్నతిన్॥

వ॥ వినను,

క॥ తనను త్రిశుద్ధిగఁ గొలిచెడు
ఘనభక్తశిఖామణులకుఁ ♦ గారుణ్యముతో
ననువుగ దర్శనభాగ్యం
బును జేకూర్పంగఁగలఁడు ♦ పుత్త్రా! వినుమా! 55

వ॥ అనుడుఁ గుమారుండు మరలఁదల్లి కిట్లనియె.

ఉ॥ చూడఁగఁగోరినాఁడను ద్రి♦శుద్ధిగ నమ్ముము నమ్ము మమ్మరో!
నేఁడిదె పోయి చూచెదను ♦ నిర్జరమాన్యుని లోకధన్యునిన్
బోడిగ నాత్మకీయజన♦భూషితసన్నిధి నందె యుందు నీ
వాడకుమా! నిషేధవచ♦నావళినిన్ జననీ! నమస్కృతుల్॥

—: హరదత్తుఁడు శివకంచికేగుట :—

తే-గీ॥ అని హుటాహుటినడిచి గే♦హంబు విడిచి
యేమిచెప్పిన మానక ♦ యేఁగుచుండె
నంత బాలునిఁ గనుచుఁ దఁ♦దంబ సుతుని
వెంటనే చనుచుండె బల్♦వేగిరముగ॥ 57

తే-గీ॥ లేగ చనియెడుజాడల ♦ నేఁగుచున్న
మొదవుపోలికఁ గొమరుఁడు ♦ పోవుజాడ
లరసి యాతురయై పోవు♦నట్టియాయ
కను గనుంగొని యిట్లను♦కొనిరి జనులు॥ 58

సీ॥ కొమరునితో నేడ♦కో పోవుచుండె నీ
యమ్మ యిదేటికి♦ట్లనెడువారు
సంతసంబునఁ గాదు ♦ చాలనాతురయయి
యరుగునట్టులఁదోఁచు ♦ ననెడువారు
కారణంబేదియో ♦ కలిగియుండును మన
కరయంగ శక్యమా ♦ యనెడువారు
వీరి వారింప నె♦వ్వారు రారేలొకో
యాత్మీయజనము లం♦చనెడువారు

తే-గీ॥ మనము వారింప వీరలీ♦చనుట దక్కి-
యూఁగనేరరు దృఢమిది ♦ యనెడువారు
ఏమియాదురో వీరిఁక ♦ నెఱుఁగఁజాల
మనుచు నుడివెడువారలై ♦రాయహమున॥

ఉ॥ అంతట గొంతసేపటికి ♦ యాయమతల్లియుఁ దండ్రి యన్నలున్
వింతగ నాయుదంతమును ♦వే విని చింతయొనర్చి సుంతఁదా
మంత మనంబుఁద్రిప్పి యెది♦యానో యదౌనని యంతకన్నఁదా
మెంతయుఁజేయఁగాఁదగిన♦దేదియు లేదని యుండి రిమ్మునన్॥

వ॥ అంత.

క॥ చని చని బాలుఁడు శివకం
చినిఁ జేరఁగఁబోయి యందు ♦ శ్రీసహకారే
శనిలయహర్మ్యం బరయుచుఁ
గనియెన్ గన్నులుగలట్టి ♦ కలిమి యమరఁగాన్॥

—: హరదత్తుఁ డేకామ్రేశాలయంబుఁ జేరుట :—

తే-గీ॥ కాంచి యాలయమునఁ బ్రవే♦శించి యంచి
తాదరంబునఁ గక్ష్యాంత♦రాళిఁ గడచి
యట నటన్ బరివార దే♦వాళిఁజూచి
గర్భగేహంబుఁదఱిసెఁ జొ♦క్క-పుబుడుతఁడు॥

తే-గీ॥ వాని వెంబడి వదలక ♦ వచ్చుచున్న
కమలకోమల యార్ద్రయై ♦ కంటిచూపు
దప్పనీ కాత్మజాతునిఁ ♦ దాను గనుచు
గర్భగేహంబు డాసె ని♦గరపుఁబ్రేమ॥

తే-గీ॥ అపుడు మధ్యందినపుటద ♦ నంతరించు
టను జగత్ప్రభునకు భోగ♦మొనరఁజేసి
యర్చకులు ద్వారబంధంబు ♦ లమరఁగూర్చి
చనిరి స్వాయతనముల కా♦సమయమందు॥

తే-గీ॥ వాటముగ బంధితములౌక♦వాటములను
గాంచి బాలుఁడు ద్రోయఁగఁ ♦ గదలకుండె
నంత నాతఁడు ముష్టిప్ర♦హారములను
సలుప బంధములూడెను ♦ దలుపులకును॥ 65

క॥ అదిగని పరమోత్సాహం
బొదవఁగ దారకుఁడు వేగ♦నున్నతతరసం
పదుదారై కామేశ్వర
పదసాన్నిధ్యంబుఁ జేరె ♦ భాస్వరగతితోన్॥

తే-గీ॥ చేరి నంతనె తన్మాత ♦ చేరఁబోవు
చుండ నంతఁ గవాటంబు ♦ లొందె బంధ
నములఁ బూర్వప్రకార మా♦కోమభయార్త
యగుచుఁ దల్పులఁద్రోయఁదె♦ర్వమరకుండె॥ 67

—: కమలకోమల విలపించుట :—

చ॥ అపుడు శిరంబు మోదుకొని ♦ హాయను నాదుకుమార! నన్ను నీ
విపు డిటఁబాసిపోవఁ దగు♦నే యను నాయనుగుంధనంబ! నే
నెపుడును నీదు మోముఁగని ♦ యెల్లమనోవ్యథలన్ద్యజింతు ని
ష్ఠపరిమితాపదబ్ధిఁ బడి ♦ యంతరమొందితి నీవు నిట్లనన్॥

సీ॥ కలలో లభించిన♦కాన్పుగుటన్ జేసి
కలలో లభించిన ♦ కానుపయ్యె
ఏకామ్రనాథేష్ట♦తోకంబు గావున
నేకామ్రనాథేష్ట♦తోకమయ్యె
అనభిలషితలబ్ధ♦మైనవరంబౌట
ననభిలషితవరం♦బయ్యె నిట్లు
ద్విజరాజమకుటైక♦దీపంబు గావున
ద్విజరాజమకుటైక♦దీప మయ్యె

తే-గీ॥ పరమసౌఖ్యాస్పదుండను ♦ భావ మొందఁ
బరమసౌఖ్యాస్పదుండయి ♦ పరఁగె నేఁడు

కటకటా! యెట్టులోర్తు నా♦కన్న కొమరుఁ
జూడఁగా నడ్డువల దేక♦చూతనాథ!

సీ|| దీనబంధుఁ డవన్న ♦ తేటమాటకు మహా
దేవ! నీకంఠదీ♦ధితియె సాక్షి
భక్తపాలుఁ డవన్న♦ప్రౌఢవాణికి మహే
శాన! మార్కండేయ♦మౌని సాక్షి
ఆపదుద్ధర్త వీ♦వనుమేల్నుడికిఁ గృపా
మండన! శ్వేతకే♦తుండు సాక్షి
కరుణామయుండ వన్♦ఘనసూక్తి కీశ్వర!
ఉపమన్యుమునివరుం ♦ డుచితసాక్షి.

తే-గీ|| శంకరుఁడ వన్నయుక్తికి ♦ క్షణము క్షణము
పొదలుభువనసమూహమే ♦ ముఖ్యసాక్షి
శివుఁడవను నామమునకెల్ల ♦ సృష్టిసాక్షి
సర్వమున కీవె సాక్షివి ♦ సత్యరూప! 70

చ|| తెఱవుమిఁకన్ గవాటములు ♦ దెఱువ నాకొమరున్ గనుంగొనన్
బఱఁగ ననుగ్రహింపు నిను♦వంటికృపానిధి కిట్లుఁ జెప్ప న
క్కఱయొకో? సర్వమున్ దెలియు ♦ గాణవు నీవు మహాపచారమీ
గఱితయెడన్ బొసంగఁ గిను♦కన్ గొన కద్దిక్షమింపు మీశ్వరా!

చ|| జనకునిఁ జూతునంచుఁ దను♦జాతుఁడు వచ్చెను నీదుజాడకా
తనుజుని వెంబడించియె కదా ♦ చనుదెంచితి నేను నిట్టులన్
దనయుని దండఁ జేర్చుకొని ♦ తద్దయు నన్నిటు ద్రోచి వేయఁగాఁ
జనునొకొ సర్వమారసిన♦స్వామివి నీవు దయామయాత్మకా!

క|| కొమరునిఁ జేకొని సాఁకుట
యమితామోదంబె దైవ♦తాధిప! కారు
ణ్యముతో నట్టులె నీ దా
స్యముఁ గోరెడుదాసినరయు!♦సత్యచరిత్రా! 73

క|| కొడుకును నాయెడ కనుపుము
తడయక దేవేశ! యట్లు♦తప్పినయేనిన్

వడిగాఁగొని చని నా వర
పుత్ర మొందుము సకలభువన♦పోషణశీలా!

క॥ ఈ రెండువిధములను నీ
వారసి నీకిష్టమైన♦యట్లు సలుపుమీ!
వేఱొకతీ రరయకు శమ
నారీ!నీ వెఱుఁగనట్టి♦వా?ధర్మంబుల్॥

తే-గీ॥ వాఙ్మనఃకాయవృత్తుల ♦ వామదేవ!
నిన్నె యారాధనము సేయు♦చున్నదాన
చిన్నదాన భవత్కృపా♦సేక మొసఁగి
నాదునందనుఁ బంపుము♦నాదుకడకు॥ 76

క॥ సర్వాంతఃకరణకథా
సర్వస్వంబును నెఱుంగు♦చతురుఁడవౌటన్
సర్వేశ్వర!నీసేవయె
సర్వస్వముగాఁగ నెంచు♦దాన నరయవే!

క॥ అని యిట్లడలుచు వేఁడుచు
ననుకంపజనింప నాపె♦యలదుఃఖ మూర్ఛన్
గొనె దేవళంబునందలి
జనులెల్లరు విస్మయపడి ♦ చక్కఁగనుఁగొనన్॥ 78

తే-గీ॥ అంత గర్భగేహంబున ♦ నపరిమేయ
దివ్యదుందుభికాహళ♦భవ్యఘోష
ములు మహోదారతరముగా ♦ మ్రోసె నంత
లోన మూర్ఛనుబాసె న♦లోలమూర్తి॥

తే-గీ॥ ఆ స్వనంబాలకించి య♦ల్లామె యపుడు
దీనిపరిణామమెద్దియో ♦ తేటపడఁగ
నోపుఁ జూచెదఁ గరుణార♦సోర్జితుండు
గలఁడు గద దీనజనలోక♦కల్పకంబు॥

హరదత్తుఁ డుపనయనాది శైవదీక్షఁజెంది
వెల్పలికి వచ్చుట.

క॥ అని యిట్లనుకొనుచుండఁగఁ
దనయుఁడు వెల్పటికి వచ్చి ♦ తనకగుపడె నా
తనధృతమాంజిక్రృష్ణా
జినయజ్ఞసరాక్షహార♦శివలింగకుఁడై ॥ 81

ఉ॥ ఆ యమ మేటిహర్మ్యమున ♦ నర్భకుఁ జూచుచునున్న యంతనే
యా యనఘాత్ముఁ డంబచర♦ణాబ్జయుగంబున వ్రాలి మ్రొక్కి త
ల్లీ! యిఁకఁదీఱె నీదుహృద♦యైకమహాంతరదుఃఖభార మ
త్యాయతశాతభాగ్యమరు♦దారఁబొసంగె జగంబెఱుంగఁగా॥

క॥ అనిన మహాహ్లాదంబునఁ
దనయుని నెత్తికొని యాకె ♦ దల నాఘ్రాణిం
బొనరిచి మొగమున ముద్దిడి
తనువెల్ల స్పృశించి యనియెఁ ♦ దనయునితోడన్॥

ఉ॥ ఎచ్చటికేగితీవు మఱి♦యెక్కడి వీవటుపుణ్యచిహ్నముల్
హెచ్చుగ నీకిటుల్ వడుగు ♦ నెవ్వరొనర్చిరి? నిన్నుఁగన్నయా
సచ్చరితుండె చేసెనొకొ ♦ చక్కఁగ మాయలకాఁ డతండు నిన్
మెచ్చెనె బిడ్డఁడంచుఁ గరు♦ణించెనె! పెంచెనె! మచ్చికన్ సుతా!

క॥ నా నోములు ఫలియించెను
నానొసటిలిఖితము గడుఘ♦నంబయ్యె నిటుల్
నా నందన! చెప్పుమిఁకను
నానందముమీఱ సువచ♦నామృతధారన్॥ 85

—: హరదత్తుఁడు శివాదరణంబును దల్లికిఁజెప్పుట :—

వ॥ అనిన హరదత్తుండిట్లనియె.

తే-గీ॥ వినుము! గర్భాలయంబున ♦ వెలుగుచున్న
దీపమును గాంచి కాంచికా♦ధీశుఁ గాంచి

నీవు చెప్పినగుణుతుల ♦ నెమకుచుండ
నంతలో లింగమధ్యంబు ♦ నందు నుండి॥

చ॥ శివుఁడు మహానుభావుఁడు ప్ర♦సిద్ధమహామరపుణ్య గణ్యుఁడై
భవుఁడు కృపారసానుగత♦భావధురంధరుఁ డిష్టబాంధవ
ప్రవరులతోడఁ దోఁచి యను♦రాగమునన్ ననుఁజూచి మెచ్చి మేల్
కవుఁగిటనొంది మామకము♦ఖమ్మున ముద్దిడి నల్వఁ జూచుచున్॥

చ॥ అతఁడును వస్త్రమండలము ♦ నంతను గూర్చి శుభ్రతివ్రతంబు ను
న్న తిఁబొసఁగించి వేదముల ♦ నాకిడె మధ్గురుఁ డిష్టలింగసం
గతనిజదీక్ష యిచ్చి యిడెఁ ♦ గౌశలమున్ సకలాగమాంతవే
తృతయును యోగవై భవ ♦ పతీతమహాద్భుతబుద్ధిసంపదన్॥

తే-గీ॥ అట్లొసఁగి లోకజనని కి♦ట్లనియె దేవి!
వీఁడునున్ నీదుపుత్త్రుఁడు ♦ వీనియెడల
దయనుబఱపు మనుటయు నా♦ధన్యమూర్తి
నన్నుఁగని ముద్దుచేసి యీ♦తెన్నుఁబలికె॥ 89

తే-గీ॥ శక్తి పూర్ణాయువును మహా♦చటులతేజ
మిచ్చితిఁ గుమార! నీకు నే ♦ హెచ్చుమిగుల
నాదు చెలియలిసుతుఁడవు ♦ నన్నుకమునఁ
గాచుచుండెద నిన్ను నే♦కాలమునను॥

వ॥ అని యానతిచ్చినంత మరల నాజనకుండు నన్నుఁ బ్రేమించి
యిట్లనియె.

మ॥ తనయా! నిన్నొకగొప్పకార్యమున కీ♦ధాత్రీతలంబందుఁ జే
ర్చినవాఁడన్ వచియింతు విన్మదియుఁ గాం♦చీభూవరాస్థానిఁ ద
ర్కనిబద్ధాశయులై నవిష్ణుమతసం♦ఖ్యావంతు లేపొంది శై
వనికాయంబును బాఱఁ దోలి రశివ♦ప్రాముఖ్య మొప్పన్ గడున్॥

తే-గీ॥ మఱియు నాభూవరుఁడు నిజ♦మండలమున
శివమతంబును నడఁచి వై♦ష్ణవమతమును
గారవించి కడున్గడు ♦ మీఱఁజేసె
శైవులేఁగిరి యన్యదే♦శముల కార్తిఁ॥ 93

ఉ॥ కావున నీవు వేగముగఁ ♦ గాంచిధరాపతికొల్వుఁజేరి నా
నావిధివాదవేదవచ♦నంబుల కైక్యముఁజూపి యన్యతం
త్రావృతమార్గభేదముల ♦ నన్నిటి ఖండనమున్ బొనర్చి యీ
శైవమతోత్తమత్వమును ♦ సాటుము నేటుగ జేని కాత్మజా!

తే-గీ॥ సర్వవిధముల నీకు నే ♦ సాహ్యపడుదు
సర్వవిద్యలయందుఁ బ్రశ♦స్తి యమరు
విజయమును గాంతు వెందు నీ♦విశ్వమందుఁ
జనుము శివమగుఁ దావక♦సరణి సతము॥ 95

క॥ అని నుడివిన నేనంతయు
విని జనకా! యుష్మదీయ♦విలసత్సముఖం
బును బాయఁజాల నిచ్చో
టనె నే వసియింతు నన దృ♦ఢంబుగ గురుఁడున్॥

క॥ నీకై పరితాపంబున
నాకులయై నీదుజనని ♦ యలఁదుఱుచుండెన్
గాక భవదీయజననమ
హాకారణ మటులెయుండె ♦ నరయవె దానిన్॥ 97

ఉ॥ నీ వెపుడెప్డు నన్ గనఁగ ♦ నిష్ఠయొనర్చెదొ యప్పుడేను నీ
భావమునందుఁదోఁచి కడు ♦ భాసురహర్ష మొసంగి వచ్చెదన్
నీ వికఁ దల్లినిన్ దఱిసి♦నిచ్చలుమెచ్చుగఁ బ్రీతిసేయుమీ!
నావచనంబు నాత్మస్మర♦ణం బొనరింపు మొనర్పు తద్విధిన్॥

తే-గీ॥ ఆ పయిఁ బ్రతిష్ఠసేయుమీ ♦ యఖిలదిశల
శైవమతదివ్యవిజయధ్వ♦జంబు నంత
నీదుమాత ననున్ జేరు ♦ నీవు పిదపఁ
జేరుదువు తల్లినిఁకఁ జేరు ♦ చిట్టివడుగ!

క॥ అని పంచెనమ్మ!యిపుడే
నినుఁజేరితిననుడు నాపె ♦నిరవధికప్రీ
తినిఁజెంది ప్రమోదాశ్రులఁ
దనయుని సేకంబొనర్చెఁ♦దద్దయుఁగడిమిన్॥ 100

—: హరదత్తుఁడు చోళరాజునకు పత్రిక నంపుట :—

వ॥ అంత శివప్రేరితులై కొందఱు విప్రు లవ్వారిఁ దారసించి విహిత భోజనంబు లొసంగి తృప్తిఁ గావించి రఖిలజనులు వారిదివ్యప్రభావంబుల నెఱింగి దేవతాత్ములని నిశ్చయించి వారలసేవించుచుండి రంత మఱునాఁడు హరదత్తుం డుషఃకృత్యంబులఁ దీర్చుకొని మతిమంతుండగు నొక్కయగ్రికులకుమారునిచే జనపాలున కొకలేఖఁ బంపుడు నాబాడబుం డాస్థానంబుఁ జేరి నేతకందించినఁ దత్రిత్యు లిట్లు చదివిరి.

ఉ॥ చోళమహీశ! నేశివుని ♦ చోదనఁ జేసి భవత్సభన్ బహు
జ్ఞాలిసమక్షమందు నిత ♦ రాధ్వదురుద్ధరకర్దమోరుజం
బాలనివారణాకృతినిఁ ♦ బాశుపతాధ్వవిమండనంబు ధా
రాళముగా నొనర్చెదఁ బ ♦ రాజితులన్ బొనరింతు లాతులన్॥

తే-గీ॥ నేఁ బరాజయమొంద ఖం ♦ డింపు నాదు
శిరము వైష్ణవులోడిన ♦ శివమతంబుఁ
జేరు మీవిఁక వేఱొండు ♦ చెల్ల దిపుడు
పాంచరాత్రులఁ బిలువుము ♦ వాదమునకు॥ 103

క॥ హరదత్తుఁడ నారయుమా!
నరపాలశిరోమణీ! య ♦ నారతగౌరీ
శ్వరచరణనళినసేవా
పరతంత్రపవిత్రహృదయ ♦ భాగ్యోన్నతుఁడన్॥ 104

వ॥ అని చదివిన భూవరుండక్కజంబొంది యీహరదత్తుఁ డెవం డెక్కడనుండి యిచటికివిచ్చేసె నీతనిస్వరూపం బెఱింగింపుఁ డనుటయు నాభూసురకుమారుం డిట్లనియె.

ఆ-వె॥ విష్ణుకంచినుండి ♦ విచ్చేసె నీతండు
మాతతోడ నేక ♦ చూతనాథ
మందిరమున కంత ♦ మానుగ ద్వారంబు
దెఱవఁబడె నతండు ♦ దేవుఁ జేరె॥

ఆ-వె॥ అంత మాయఁబడియె ♦ నాకవాటంబులీ
యనఘుజనని వెల్వ♦టనె వసించి
చాలఁజింతచేసి ♦ శంకరు వేఁడ వె
ల్వటికివచ్చె మరల♦బాలకుండు॥

క॥ ఆ లో నుపనీతుండై
మేలగు శైవవటుచిహ్న♦మిళితతనుండై
బాలుఁడు సకలామ్నాయము
లోలిఁజదువుచుండె నెంత♦యును నబ్రముగా॥

వ॥ అతండే నేఁడు శైవసిద్ధాంతవాదార్థ మీపత్రికను మీయాస్థానంబున కనిపె వేవేగ గోష్ఠిఁ గూర్పుమనుడు భూనాథుఁ డద్భుతపడియమాత్యులతో యోజించి తేపటిప్రత్యూషంబున సభఁ గూర్పుదు నట్టివాదమ్మునకు రమ్మని సెలవిచ్చి యవ్విప్రకుమారుం బంపి పాంచరాత్రపండితులకు నింకను మాధ్యస్థతపొంటే వాద ప్రాబల్యదౌర్బల్యంబు లరయుటకుఁగాను స్మార్తవిబుధులకుఁ గూడ మఱునాటిప్రాతస్సమయంబున కాహ్వానంబుఁబంపె హరదత్తప్రేషితాగ్రకులుండు రాజానుమతంబు హరదత్తునకుం దెలిపిన నాతండామోదించెనంత వారల కాయూరిబ్రాహ్మణులెల్ల భక్తితో మజ్జనభోజనాదుల నిర్వహింపుచుండి రంత శివకంచి యం దెల్లెడ.

క॥ పంచాబ్దంబులబాలుఁడు
పంచాననగేహమునకు ♦ వచ్చి తదీయా
భ్యంచితకృప నుపనయనముఁ
గాంచి యఖిలవేదములను ♦ గనెననిరి జనుల్॥

—: సూర్యాస్తమయ వర్ణనము :—

తే-గీ॥ చండకరుఁ డైనహరిదశ్వఁచక్రవర్తి
యంతరం బొంద నంతనే ♦ యఖిలదిశల
నీలపటధరతస్కర♦నికర మవని
నాక్రమించె ననఁ దమ ♦ మతిశయించె॥

వ॥ అంతఁ గొంతవడికి,

తే-గీ॥ విభునిప్రతినిధియైనట్టి విధుఁడు చేరి
తనకరంబుల నాఘనధ్వాంతములను
బాఱదోలి జగంబంత భవ్యకౌము
దీవితానమునన్ గూర్చె దృఢసుశాంతి॥ 112

—: ఆశ్వాసాంతము :—

క॥ నిరవధికకృపాకరసు
స్థిరహృదయాంపాస్తభక్తచేతోవ్యసనా!
అరిరక్షోవిక్షోభణ
కరణమహానిశితశౌర్య ఘన మల్లేశా!

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాప్రసాదితసుకవితాభాగధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయవిరచితంబైన హరదత్తవిజయ కావ్యంబందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# హరదత్త విజయము

## చతుర్థాశ్వాసము

క॥ శ్రీశార్వితదృక్కనకకు
శేశయపూజాప్రహృష్ట•చేతఃకమలా!
కోశాధిపేష్టదేవా!
శ్రీశైలమునీంద్రవరద!•శ్రీమల్లేశా !

వ॥ దేవా!అవధరింపుము.

—: సూర్యోదయ వర్ణనము :—

క॥ కాలపుమాంసుం డున్నతిఁ
గైలాసాధిపతిమూర్తి•కమనీయశ్రీ
లాలిత్యముఁ జూపెట్టిన
లీలన్ శౌక్ల్యంబువిలసి•లెన్ జగమెల్లన్॥ 2

తే-గీ॥ పద్మినీలోకబాంధవ•పరిణయమున
మ్రోగుమంగళకాహళ•ముఖ్యవాద్య
నిస్వనంబట్లు నిండుగ•నెగడె మధుర
బహుళశుకపికశారికా•ప్రముఖరవము॥ 3

ఉ॥ సర్వజగన్మహేశ్వరుని • చారుతరోత్తమతత్త్వదర్శనా
ఖర్వమహోత్సవేక్షణని•కాముమనోరథుఁడై కరంబు స
త్పూర్వుఁడు వేగఁ బూర్వకుధ•రాగ్రిమశృంగముఁజేరి పేర్మిమైఁ
బర్వఁగఁ జేసె నెల్లెడల • భాసురదివ్యగవీవరంపరన్॥ 4

తే-గీ॥ ఓర్వలేనట్టికుముదిను ♦ లుడుకుమీఱ
లోచనంబులు మొగిడించె ♦ లోలుపతను
పద్మినీసముదయముఁ వి♦భాసురప్ర
భాసముత్కర మొప్ప వి♦కాస మొందె॥ 5

చ॥ బుధగణ మెల్లెడ౯ విమల♦పుష్కరిణీతతిఁ గ్రుంకి తేజసాం
నిధి యగుపద్మమిత్రునకు ♦ నిష్ఠయొసంగఁగ నర్ఘ్యమిచ్చి స
ద్విధివిహితప్రకారముగ ♦ విశ్వగురూర్జితలింగపూజనం
బధికతరానురాగమున ♦ నాచరణంబొనరించి రున్నతి౯॥

ఉ॥ ఆ హరదత్తుఁ డత్తఱిని ♦ నౌపసకర్మము లన్నిదీర్చి "దా
సోహ మవ ప్రభో శశిక♦లాభరణస్ఫురితోత్తమాంగ" యం
చాహరునిన్ మది౯ గొలిచి ♦ యంబపదంబుల కర్థి మ్రొక్కి తద్
వ్యాహృతమంగళోక్తుల ను♦దారమతి౯ గొని వాదకామియై॥

—: వాద సభ :—

తే-గీ॥ రాజమందిరమున కేఁగి ♦ రమ్యతత్స
భాయతాయతనముఁ జేరి ♦ యందు నుచిత
పీఠములఁ గూరుచుండి సం♦ప్రీతి నృపునిఁ
గాంచి యాశీర్వదించి యి♦క్కరణిఁ బలికె॥ 8

ఉ॥ నిన్నటి నాదులేఖ గమ♦నించితివె యుండువు దానిలోన నేఁ
బన్నుగ వ్రాసినట్టిపరి♦పాటిఁ దలంచి యసి౯ ధరించి నా
తెన్నున నోటుదోఁచఁ దలఁ♦దీయుము కాక యె నే జయించిన౯
సన్నుతిమీఱ నీవిఁకను ♦ శైవమతంబుఁ బరిగ్రహింపుమా!

వ॥ అని నంత నంతకుఁబూర్వదినంబుననే తేనిచేఁదెలుపఁబడి వాదార్థ మాహూతులై చనుదెంచిన ప్రతివాదభయఙ్కరగండభేరుండులును ప్రతిపక్షకేసరులును దర్కపంచాననులును నుభయవేదాంతసిద్ధాంతపారంగతులును విద్వన్మార్తాండులు విద్వత్కేసరులు మున్నగువారు సభారంగంబుఁ జేరి వాదార్థం బుచితపీఠంబుల నలంకరించియుండుటయుఁ జూచి ధరణీశ్వరుం డపుడు హరదత్తుని

ముఖారవిందంబుఁ బరీక్షించి చూచి దివ్యపురుషుండని నిశ్చయించి వాదంబునకు సెలవొసంగె నంతఁ బాంచరాత్రపండితులు హరదత్తుఁ బరికించి యితండు పాషండుండని తనితో మేమెట్లువాదింతు మనుడు హరదత్తుండా శ్రీవైష్ణవశిరోమణులఁ గాంచి పేవాక వచఃపరిపాకప్రకారం బొప్ప నిప్పగిది మెప్పించె॥

తే-గీ॥ ఎవ్వ రామ్నాయబాహ్యులై ♦ యెసఁగువారొ
యట్టివారలె పాషండు ♦ లగుదు రిలను
వాదమున నిపుడోడిన♦వారు దృఢము
గాను బాషండు లన్యులు♦గారు వినుఁడు॥ 11

వ॥ వాదంబందే వేదవిహితావిహితమతంబు లెఱుంగఁబడు నట్లుకాక వాదంబునకీయకొనకుండినఁ బరాభూతులైనట్లు లెక్కింపఁబడు నను టయు నాలకించి చోళమహీనాథుం డిట్లనియె.

క॥ ఎవరైన నేమి మనవై
ష్ణవమతమునెదిర్చి రేనిఁ ♦ జక్కఁగ నవ్వా
రి విజితులఁ బొనరించుట
యె విధానము గాన వా♦దుకీయకొనుఁ డికన్॥

వ॥ అని వైష్ణవపండితులకుఁ జెప్పి హరదత్తు నుపలక్షించి గంభీరస్వరం బున నిట్లనియె.

ఉ॥ బాలక! యస్మదీయమత♦పండితవర్యులతోడ వాదమున్
జాలగ సల్పవచ్చితివి ♦ సంతసమే విను మిట్టి శాస్త్రవి
జ్ఞాలముమధ్య నోడుపడు♦చందమ యేనియు యుష్మదుక్తినే
పాలనమున్ బొనర్తుఁ బెఱ♦పక్షమునందును నీదుసూక్తియా॥

వ॥ అనిన హరదత్తుండిసుమంతయు జలింపక యోమని యంగీకరించి వాదమునకుఁదొడంగి.

సీ॥ అగ్రపీఠంబున ♦ నమరినప్రతివాది
భీకరుండనుఘనుఁ ♦ బిలిచి వేగ
నతఁ డన్నవన్ని ము♦న్నానువాదన మొనర్చి
తత్ఖండనంబును ♦ దగనొనర్చి

పొల్లునుడులు లేని ♦ పొలుపునఁ దొందర
పడక పలువురడ్డ♦పడినఁ గినుక
పడక యందఱుఁదీర్చ ♦ పలుశ్రుతిస్మృతిసూత్ర
తతి కేకవాక్యతఁ♦దా ఘటించి

తే-గీ॥ లక్షణప్రమాణగతవి♦లసితసరణి
శ్రీశివాద్వైతసిద్ధాంత♦సిద్ధిఁ దెలిపి
మధ్వవర్తుల్లావిజ్ఞుల ♦ మనములలర
విజితుఁ గావించి వైష్ణవు ♦ విడిచి యంత॥

తే-గీ॥ అంతనే ప్రతిపక్షహా♦ర్యక్షుఁ బిలిచి
యేమియంటివి వచియింపు ♦ మిప్పు డనుచు
నాతనిని నట్టులె జయించి♦యంద ఱపుడు
వరుస రా హారదత్తుఁ డ♦ద్వారిఁ గెలిచె॥ 18

క॥ ఇప్పగిది విజయమునుగొని
తప్పక శివదేవుఁడె పర♦తత్త్వం బనియుఁన్
మెప్పుగ శివుని భజించిన
గొప్పమతము శైవమే యఁగుట స్థాపించెన్॥

వ॥ అంతభూవరుండు తమపండితులోటుపడుటఁ జూచి సుంతఁజింతించు చుండుడు నాలోనఁ బాంచరాత్రపండితు లొకకుట్రఁ బన్ని నృపతి కిట్లనిరి.

ఉ॥ ఇందఱ సిట్లు నేఁడిట జ♦యించినయీహారదత్తుఁ డెంతయున్
మందులమాఱియో యకట!♦మాయలకాఁడొకో! లేక దేవతా
స్పందితమూర్తియో యెఱుఁగఁ♦జాలము మేమిఁక మాదువాదనం
బందొక లోటులేదు జయ♦మయ్యెను వాదిమహత్త్వశక్తికిన్॥

వ॥ కావున నిదివాదిబలంబుగాని వాదబలంబుగా దీజయం బపజయంబు క్రిందనే లెక్కింపవలయు ననుటయు విని ధరాపాలుండు మనంబు నందు.

ఆ-వె॥ క్రిందఁబడినఁగూడఁ ♦ గృష్ణప్పబొట్టు లే
గట్టివాఁడనియెడు ♦ కరణి వీర

లిట్టు లాడుచుండి ♦ రెట్టులొప్పింతు ని
వ్వారిననుచు మదివి♦చార మొందె॥ 23

వ॥ అంతనే హారదత్తుండు ప్రతివాదులకాపట్యం బెఱింగి మందహాసం బొనర్చి మానవేశ్వరున కిట్లనియె. 24

సీ॥ ఇది వాదిబలమైన ♦ నినుఁనిచ్చెనను నా
కక్కడు నిర్మితమొనర్చి ♦ కాల్పఁజేసి
పావకజ్వాలలు ♦ ప్రజ్వరిల్లుచునుండ
నేకామ్రనాథమ♦హేశదివ్య
మందిరప్రాసాద♦మహనీయసుస్థలి
నుంచుఁడు వాదంబు♦నుడిగి నేను
శివుని నుతింపుచుఁ♦జేరి యద్దానిమె
ట్లెక్కి గోపురమున ♦ కేఁగువాఁడ

తే-గీ॥ అపుడు వాదబలంబుగా ♦ నన్వయింపు
మట్లుకాకయె వీరలే ♦ యట్లొనర్చి
రేని వారలవాదమే ♦ హెచ్చటంచు
నీదుశిశుకు గుఱియాఁడు ♦ నిక్కమిద్ది॥

వ॥ అనుఁడు మానవేంద్రుండితండు ప్రాకృతపురుషుండు గాఁడు పరమేశ్వరప్రేరితుండే యని మనంబున నిశ్చయించియుఁ బాంచరాత్రపండితాంతరంగికసంశయంబపనయింపుటకును హారదత్తమహిమాతిశయంబుఁ దద్వాదప్రాశస్త్యంబును లోకంబెఱుంగుటకును హారదత్తోక్తప్రకారం బాయసనిశ్రేణి నూటయిరువదియొక్కమెట్లు కలదాని నమ్మఱునాఁడు నిర్మింపఁజేసి యగ్నులం దరుణదారుణకరాళజ్వాలామండితం బగునట్లుకాల్పించి యేకామ్రేశ్వరప్రాసాదగోపురభూమిఁ బ్రవేశపెట్టుఁడు నంతకుమున్నె హారదత్తుండు నిర్వర్తితసముచితకార్యకలాపుండై మాతృవందనంబొనరించి తదాశీస్సూక్తులను గొని హృదయంబునఁ బరమేశ్వరాంఘ్రులకుఁ బ్రణతిచేసివచ్చి నైకటికసకలజనకోలాహలంబు వారించి వసుమతీకాంతుండు సమీక్షించి కాంచుచుండఁ బ్రథమసోపానంబుఁ జేరి. 26

— ఆంధ్రీకృతపంచరత్న స్తవము :—

*సీ॥ ద్విజసముదాయసే♦వితమైనగాయత్రి
కర్థమై యొప్పిన ♦ యట్టికతన
దశరథతనయుఁడై ♦ తనరుశ్రీరాముఁడు
తనను స్థాపించి కొ♦ల్చినకతమున
కైలాసయాత్రను ♦ గావించి శివవరం
బున శౌరి పుత్త్రులఁ ♦ గనుటకతన
అబ్జసాహస్రన♦యనముల విష్ణుండు
శివలింగమును సమ♦ర్చించుకతన

తే-గీ॥ హరికి హరుఁ డల్లదానవ♦హరణచణను
దర్శనంబిచ్చినట్టిక♦తమున నీఁకను
బశుపతియె సర్వదైవత♦ప్రకరమునను
బ్రముఖుఁడని నిశ్చయంబుగఁ ♦ బలుకవలయు॥

వ॥ అని పఠించి యధిరోహించి.

**సీ॥ అఖిలమోహాపహుఁ ♦ డైనమన్మథుఁ బట్టి
దహియించి నట్టియ♦ద్దానఁజేసి
సకలజగత్ క్షోభ♦జనకమై వెలసిన
గరళంబుమ్రింగిన ♦ కతముఁజేసి
సర్వదేహివినాశ♦సంధాయకాంతక
గర్వాపహుం డైన♦కతముఁజేసి
లోకత్రయజనపీ♦డాకరత్రిపురముల్
గాల్చిన యట్టి య♦క్కతముఁజేసి 28

---

హరదత్తాచార్య పంచరత్న స్తవము

*1 గాయత్రీవల్లభత్వా ద్దశరథతనయస్థాపితారాధితత్వాత్
శౌరేః కైలాసయాత్రావ్రత ముదితతయా తస్య పుత్త్రప్రదానాత్
నేత్రేణ స్వేన సాకం దశశతకమలై ర్విష్ణునా పూజితత్వాత్
తస్మై చక్రప్రదానా దపిచ పశుపతి స్సర్వదేవప్రకృష్టః॥

తే-గీ॥ అల్ల దక్షాధ్వరఘనజ♦యంబుఁ జేసి
అర్జునున కస్త్రమిచ్చిన♦హారువుఁ జేసి
పశుపతియె సర్వదైవత♦ప్రకరమునను
ప్రముఖుఁడని నిశ్చయంబుగఁ ♦ బలుకవలయు॥

వ॥ ఇట్లు వచించి ద్వితీయసోపానం బెక్కి—

***సీ॥ భూమియందున సర్వ♦భూతకోటులచేత
నర్చింపఁగాఁబడి♦నట్టికతన
తారతమ్య మెఱింగి ♦ తగినట్లువారి క
పైశ్వర్యముల నిచ్చి♦నట్టికతన
హంసవరాహరూ♦పాజవిష్ణుల కగో
చరశిరోంఘ్రులు గల♦సిరికతమున
సకలవిష్టపమహా♦చక్రంబునకు నుపా
దానకారణము తా♦నైనకతన

తే-గీ॥ ఉద్భవప్రలయప్రము♦ఖోగ్రవికృతు
లేవియును గాని తనకెప్డు ♦ లేనికతన
పశుపతియె సర్వదైవత♦ప్రకరమునను
ప్రముఖుఁడని నిశ్చయంబుగఁ ♦ బలుకవలయు॥ 29

****సీ॥ వారాణసీపురిఁ ♦ ద్వైపాయనభుజంబు
లను స్తంభనంబుచే♦సినకతమున
యాతుధానపురత్ర♦యధ్వంసవేళ వృ
షాయితవిష్ణుగ్ర♦హణముకతన

---

**2 కందర్పధ్వంసకత్వా ద్గరళకబళనా త్కాలగర్వాపహారాత్
ద్దైతేయావాసభూతత్రిపురవిదళనా ద్దక్షయాగే జయిత్వాత్
పార్థస్యాస్త్రదానా స్మరహరివిజయా న్మాధవే స్త్రీశరీరే
శాస్తుస్సంపాదకత్వా దపిచ పశుపతి స్సర్వదేవప్రకృష్టః॥

వైధాత్రశీర్షంబు ♦ వడిఁద్రుంచి గళహార
మందుఁ జేర్చి ధరించి♦నట్టికతన
అతులితజ్ఞానమో♦క్షాధికారియయి తా
నవ్వి భక్తుల కిచ్చు♦నట్టికతన
తే-గీ॥ అష్టమూర్తియై సర్వాబ్జ ♦ జాండవితతి
నిండి యొకఁడుప్రకాశించు♦చుండుకతన
పశుపతియె సర్వదైవత♦ప్రకరమునను
బ్రముఖుఁడని నిశ్చయంబుగఁ♦బలుకవలయు॥

వ॥ ఇప్పగిదిఁ జెప్పి చతుర్థసోపానం బెక్కె.

*****తే-గీ॥ స్వార్థతనుభూతహరి♦యు క్తుఁ♦డగుటకతన
అలవిశిష్టైక్యమున ముఖ్యు♦డగుటకతన
పశుపతియె సర్వదైవత♦ప్రకరమందు
నధికుగాఁదలపోయుదు♦నాత్మయందు॥

వ॥ ఇట్లు నిర్ణయించి పంచమసోపానం బెక్కె.

---

***శ్లో॥ భూమా లోకైరనన్యైః స్వతతవిరచితారాధితత్వా దమీషా
మస్మైశ్వర్యప్రదానా న్నిఖిలజగదుపాదానభూతాధికత్వాత్
హంసక్రోడాంగధారిద్రుహిణమురహరాదృష్టశీర్షాంఘ్రికత్వాత్
జన్మధ్వంసాద్యభావా దపిచ పశుపతి స్సర్వదేవప్రకృష్టః
**"*శ్లో॥ వారాణస్యాంచ పారాశరినియతభుజస్తంభనాత్ త్రిప్పురాణాం
ప్రధ్వంసే కేశవేన శ్రితనిజవపుషా ధారితత్వాత్మతలత్వాత్
అస్తోకబ్రహ్మశీర్షాస్థ్యనిశకృతగళాలంక్రియాభూషితత్వాత్
ద్దానాత్ ప్రజ్ఞానముక్త్యో రపిచ పశుపతిస్సర్వదేవప్రకృష్టః
***** శ్లో॥ వైశిష్ట్యే యోనిపీఠాయితనరకరిపుస్పష్టభావేన శంభో
స్స్వస్యైకార్థప్రతీకాయితహరివపుషా లింగితత్వేన యద్వా
అప్రధాన్యా ద్విశిష్టాద్వయ సమధిగమే దానవానామరాతేః
శంభోః ప్రాధాన్యయోగా దపిచ పశుపతిస్సర్వదేవప్రకృష్టః

క॥ ఋతమును సత్యము పరమును
వితతబ్రహ్మమును గృష్ణ♦పింగళ మున్నై
సితరేత మయి విరూపా
క్షత విశ్వాకృతిఁ బురుషతఁ ♦ గనుదీవు శివా!

వ॥ ఇట్లు వక్కాణించి యాఱవమెట్టెక్కె.

తే-గీ॥ భూతకాలమునందలి ♦ భువనమును వి
చిత్రముగ బహుజాతమై ♦ చెలఁగునద్ది
జాయమానంబునగునద్ది ♦ సర్వ మితఁడె
రుద్రుఁ డాతనికిదె జోత ♦ రూఢిగాను॥

తే-గీ॥ ఇల రుదంద్రావయతి యను♦నిద్దపద్ధ
తిని సకలదుఃఖములనెల్లఁ ♦ ద్రెంపువాఁడ
గుటను రుద్రుఁడనంబడె ♦ నిటలలోచ
నుఁడు మహాదేవుఁడెందు ఘ♦నుం డరయఁగ॥

వ॥ ఇట్లు స్పష్టీకరించి నిర్వచించి సప్తమసోపానం బధిరోహించె.

క॥ శివు నద్వైతుఁ జతుర్థునిఁ
గవివరులు దలంతురెందుఁ♦ గౌశల్యమునన్
భవుఁడతఁ డాత్మమతం డేక ద
విజ్ఞేయుఁడును వేది♦తవ్యుండు నిఁకన్॥

వ॥ అని ప్రకటించి యష్టమసోపానం బెక్కె.

*క॥ అమరిక "శబ్దాదేవ
ప్రమిత" యనెడుసూత్రమున శి♦వా! తావకశ
బ్దమయిన "ఈశాన" యనుప
రమశబ్దముచేత నాత్మ♦ప్రకటితమయ్యెన్॥

---

* కవికులగురోః కాళిదాసస్య విక్రమోర్వశీయనాటకనాందీశ్లోకే

శ్లో॥ వేదాంతేషు యమాహురేకనిలయంవ్యాప్యస్థితంరోదసీ
యస్మిన్నీశ్వరఇత్యనన్యవిషయశ్శబ్దో యథార్థాక్షరః

తే-గీ॥ అట్టి ఈశేశ్వరేశానయనెడుశబ్ద
ములునన్యవిషయములై పూన్కి-నిన్నె
వాకొను యథార్థముగనంచుఁ బ్రౌఢబుధులు
కవిగురుల్ గొనియాడిరి ♦ ఘనతయలర॥

వ॥ ఇట్లు ప్రతిపాదించి నవమసోపానం బెక్కె-.

సీ॥ అంతరధికరణమందు "తద్ధర్మోప
దేశా" దనుచు విశదీకరించు
టరయ "యఏషోంతరాదిత్యే" యను ఋక్కు-
నందు "యఏషోంతరక్షిణీ" య
నెడుఋక్కు-నందు మహేశధర్మము లుప
దిష్టంబులగుట నాదిత్యమండ
లాంతర్గతుండును ♦ నక్షిస్థపురుషుఁడు
హరుఁడని విస్పష్టమయ్యె నమ్మ

తే-గీ॥ హోపనిషదుక్తి శ్రుతులును ♦ ద్యుమణిమండ
లము ననువదించి తన్మండలగతపురుషు
శివునిగ "నమోహిరణ్య" యంచు విశదముగఁ
జెప్పె నుపబృంహణంబులు ♦ చెప్పె నిట్లు॥

వ॥ ఇట్లు నిబంధించి దశమసోపానం బెక్కె-.

---

ఛాందోగ్యోపనిషది అథ యఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః-
అథ య ఏషోంతరక్షిణి పురుషో దృశ్యతే.........ఋక్సామ తదుక్థం తద్యజుః స్తద్బ్రహ్మ......ఇత్యాది-
మహానారాయణోపనిషది ద్వాదశానువాకే ఆదిత్యో వా ఏష ఏతన్మండలంతపతి......య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషః ఇత్యనేనాదౌ ప్రభాకరమండలం నిర్దిశ్య తతోస్మిన్ మండలే ప్రభాముపదిశ్య తదర్చిషి ప్రభాకరం ప్రదర్శ్య త్రితయస్యైతస్య ఋక్సామ యజూరూపత్వంచ తన్మండలత్వం తల్లోకత్వంచ నిగూహ్య తస్మిన్ త్రయీమండలరూపే ఆదిత్యేఅంతర్యామిణం హిరణ్యపురుషం ప్రస్తుత్య "ఏష భూతానా మధిపతి"రితి తస్యభూతాధిపత్యం చోద్ఘాట్య

* సీ॥ ధ్యానయోగ్యుఁడవన్న ♦ త్రైలోకికఖిలలో
కావన! మునినిచ♦యంబు సాక్షి
మోక్షప్రదాతవన్ ♦ భూరికిరీటికిఁ గృపా
మండితాత్మక! శుక♦పూని సాక్షి
పూజనీయుఁడవన్న ♦ పుణ్యాసూక్తికి లోక
శంకర! వేదపుం♦జంబు సాక్షి
భక్తహింసకవధ♦ప్రౌఢుఁడవనునుడి
కాపదుద్ధారక! యముఁడు సాక్షి

తే-గీ॥ నిత్యుఁడవు నీవనుట కీశ! ♦ నీరజభవ
మస్తకోత్కరహారముల్ ♦ మహితసాక్షి
ఇఁక ననాద్యంతమూర్తివన్ ♦ ప్రకటనమున
సాక్షులీ పద్మగర్భప♦ద్మాక్షులు లభవ!

వ॥ ఇట్లు సేవించి యేకాదశసోపానం బెక్కె.

---

తద్వేదనేన (ఉపాసనయా) తత్సాయుజ్యలబ్ధి రుపదిష్టా॥ ఉత్తరాను
వాకేష్వపి "ఓం నమో హిరణ్యబాహవే హిరణ్యరూపాయ......
పతయే నమోనమః"ఇతి తస్యైవ హిరణ్యపురుషస్య శివస్య అంబికా
పతయఇత్యాది విశేషణద్వారావిభూతిరభివర్ణితా॥
బోధాయనోపబృంహితోక్తా-

శ్లో॥ మండలాంతరగతం హిరణ్మయం భ్రాజమానవపుషం శుచిస్మితం
చండదీధితి మఖండవిగ్రహం చింతయేన్మునిసహస్రసేవితం-
శాతాతపోక్తా శ్లో॥సౌరమండలమధ్యస్థం సాంబం సంసారభేషజంనీలగ్రీ
వంవిరూపాక్షం నమామి శివ మవ్యయం॥ఇతి-

ప్రాచీనభట్టపాదోక్తా-శ్లో॥ ధ్యేయత్వే తవ సాక్షిణో మునిగణా మోక్ష
ప్రదానే శుకః

* వంద్యత్వే నిగమా స్స్వభక్తవినతక్లాంతౌ కృతాంతాదయః
నిత్యత్వే చ పితామహస్య చ శిరస్సగ్బృంద మాద్యంతయోశ్శూన్య
త్వేచ వరాహహంసవపుషౌ పద్మాక్షపద్మాసనౌ॥

వ॥ ఇఁకఁ దక్కినమెట్లులందుఁగూడ దేవతాంతరతారతమ్యంబు నిరూపించుపద్యంబులఁజదువుచుఁ గడుసులభంబుగ నధిరోహించి చిట్టచివరమెట్టుంజేరి.

ఇందుకలావృత్తము— బాలునిపైఁ గృపఁ ♦ బఱపు మహేశా!
బాలకలానిధి♦పరివృత కేశా!
పాలనసేయుము ♦ వసనకృతాశా!
లీల యిదా వికలితయమపాశా!

వ॥ ఇట్లు వేఁడి యద్దానిఁగూడ నధిరోహించి.

తే-గీ॥ జ్వలితనిశ్రేణిసోపాన♦జాల మిట్లు
సుంతశ్రమ లేక యే కడు♦వింత నెక్కి
యగ్రభాగంబుఁ జేరుడు ♦ నాకసంబు
నందు "శివఏవకేవల" ♦ యంచు మ్రోసె॥

తే-గీ॥ ఆప్రకారముఁ గని విని ♦ యఖిలజనము
లెంతయేని ప్రపత్తిమై ♦ సంతసించి
హర మహాదేవ శంభో మ♦హాత్మ!యని స్మ
రించి హరదత్తు మిగుల ను♦తించిరపుడు॥

క॥ అటుఁగని వైష్ణవులెల్లరుఁ
బటుభయమును జెందివేగఁ♦బఱుగిడి రింకన్
గటకట పెట్టకయేయం
తటవారల విడిచెను హర♦దత్తబుధుఁ డటన్॥

వ॥ అంతఁ జోళమహీంద్రుం డత్యాశ్చర్యపరీతచేతస్కుండై యుద్భూతశివభక్తిప్రేరితుండై ధరణీతలంబున సాగిలంబడి హరదత్తు నిట్లు ప్రార్థించె.

—: చోళరాజు శైవదీక్షను జెందుట :—

ఉ॥ రమ్మ మహాత్మ!నీపదప♦రాగలవమ్మను నీనృపాలమూ
ర్ధమ్మునఁజేర్చిపంకముఁబ♦రాస్తమొనర్చి వరేణ్యగణ్యపు

ణ్యమ్మగు శైవదీక్షను స♦మంచితరీతి ననుగ్రహింపు! హ
ర్షమ్మ ఘటింపు నింపుము ధ♦రాస్థలి నెల్లెడ శాంభవోన్నతిన్॥

మ॥ అని యర్థించిననంత శైవబుధుఁ డా♦హ్లాదంబుతో నెట్టులె
క్కానో మెట్టట్లవరోహణంబు సలిపెన్ ♦ క్రీడాప్రకారంబునన్
జననాథుండు తదంఘ్రియుగ్మమున శీ♦ర్షం బుంచి సేవించెఁ ద
క్కానవిద్వద్వరు లెల్ల మ్రొక్కి నుతులన్ ♦ గీర్తించి రత్యున్నతిన్॥

క॥ మనుజేశ్వరుఁ డర్థింపుడు
ఘనుఁ డా హారదత్తగురుఁడు ♦ గౌరీశ్వరదీ
క్షను నొసఁగి శర్వలింగం
బును ధారణమున్ బొనర్చె ♦ భూవరున కొగిన్॥

క॥ ఆవెంటనె రాజసభన్
శైవమనీషిప్రవరులు ♦ సభ్యు లగునటుల్
గావించెను శివధర్మము
లేవేళను సలుపునట్లు ♦ లేర్పఱచె రహిన్॥

తే-గీ॥ నృపతి హారదత్తునిఁ దదంబ ♦ నపరిమితమ
హాసరణి గౌరవించి శ♦దాత్మమొఱఁగి
తా మెలంగుచు వారి ని♦తాంతభక్తి
తోడ సేవించుచుండె సం♦తుష్టమతిని॥

తే-గీ॥ దూరదేశము లేగి యుం♦డు చిరవాస
మున్న శైవులు మరలఁ జో♦ళోర్వి శాంభ
వాభ్యుదయ మాలకించి మ♦హాప్రమోద
మొంది చేరిరి కాంచికి ♦ నుత్సుకతను॥

ఆ-వె॥ విష్ణుకంచినున్న ♦ విష్ణుచిత్తాచార్య
తనయు లిరువురు హార♦దత్తధీరుఁ
డాత్మభాగినేయుఁ ♦ డగుటనెఱింగి యే
కాంతమందు నతనిఁ♦గదిసియనిరి॥

శా॥ ఆస్మాకీనసహోదరీసుతుఁడ వ♦న్యాప్రాప్తసామర్థ్యల
క్ష్మీస్మేరాంచితమూర్తి! రమ్మ హరికాం♦చీక్షేత్ర మస్మద్భృశా

పస్మారాధిగతాపచారమును భా♦వంబందు మన్నింపు మి
ష్టస్మత్సంఘము నుద్ధరింపుము! జగం ♦ బత్యంతమున్ జేర్కొనన్॥

క॥ వినుము సుదర్శననగతి నీ
వనయము రాజిలుటఁజేసి ♦ యనఘాత్మ! సుద
ర్శనబుధుఁడని పిలిచెద మిఁకఁ
గనుఁగొనుము నిజాన్వవాయ♦గౌరవసరణిన్॥

క॥ అన విని హరదత్తబుధుం
డును వారలఁ జూచి యపు డ♦నూనస్మేరాం
ననుఁడై యిట్టుల ననియెను
ఘనతరమకరందసార♦కనదురుసూక్తిన్॥

తే-గీ॥ అయ్య! చెలియలి వెలిఁబెట్టి♦నట్టివారు
మీరు గారేమొ? శూద్రుల♦తీరు మీర
మెత్తి కూడును నీరంబు ♦ లిచ్చినట్టి
దాతలో కారొ? యేమని ♦ తలఁపవలయు॥

తే-గీ॥ ఏను మజ్జనయిత్రియు ♦ నేఁగుదెంచు
నపుడు మముఁ బల్కరింత త్ర♦పాకరంబు
గా మది దలంచినట్టి ని♦ష్కామధీరు
లో? వినుఁడు ప్రస్తుతపునుడు♦లను గ్రమమున॥

సీ॥ రహిం ద్వాదశోర్ధ్వపుం♦డ్రములు దీర్తురు మీర
లొడలెల్లబూదిఁ బూ♦యుదుము మేము
సొగసగు బంగారు♦నగలు దాల్తురు మీరు
రుదురాకపూస లే♦యుదుము మేము
ద్రవిడమంత్రముల నెం♦తయును బ్రేమింతురీ
రేమొ త్రయినె యాశ్ర♦యింతు మెపుడు
చిదచిద్విశిష్టంబు ♦ సిద్ధాంతమది తమ
కదియు శక్తివిశిష్ట ♦ మమరు మాకు

తే-గీ॥ చక్రముద్రాంకితులు మీరు ♦ శర్వలింగ
ధారులము మేము విష్ణుమ♦తంబు మీది

శైవమతమగు మాది ని♦స్సంశయముగ
మీకు మాకును బొత్తెట్లు ♦ చేకుఱు నిఁక॥

క॥ ఏతీరైనను మీరలు
మాతులు లగు టెంతయేని♦మాన్యులు మఱియున్
బ్రీతినొ యప్రీతినొ నా
మాతను నను సాఁకితిరి స♦మంచితచరితుల్॥

వ॥ కావున.

క॥ వందనపురస్సరం బా
నందితమతి నొసఁగువాఁడ ♦ నాకాన్కల మీ
రొందుఁడని యొసఁగె సేల్వలఁ
గుందనపుస్ హారముల మి♦గులఁ రొక్కములన్॥

వ॥ అంత వా రత్యంత్యంబు సోదరిని హారదత్తుని విష్ణుకంచి కాహ్వా
నంబుచేసినను వా రొడంబడక యందు హారదత్తుం డవ్వారికి
మరల నిట్లనియె.

సీ॥ శివమతంబును బాసి ♦ శ్రీవైష్ణవమతంబు
నను నను జేర ర♦మ్మనుట యొకఁడు
శ్రీవిష్ణుగరిమంబు ♦ శ్రీవైష్ణవమతంబు
ఘనతను నను జెప్పు♦మనుటయొకఁడు
ఏకామ్రనాధుని ♦ యీఁకాంచి విడి మమ్ముఁ
విష్ణుకంచికిఁ జేరఁ ♦ బిలుచు టొకఁడు
మీతోడ నేని మీ♦వ్రాతంబుతో నేని
కుడువంగ మమ్ము రాఁ♦గోరు టొకఁడు
తే-గీ॥ గాక తా మేది కోరిన ♦ గారవమున
నాతఁడదె యట్టిపనిని న♦వ్యాజమతి భ
వజ్జనుఁడు నిర్వహించు నే♦బాధ లేదు
చనుఁడు నుతులివె వైష్ణవ♦స్వాములార!

వ॥ అనుటయు వారలు సత్కారంబులు గైకొనియుఁ జిన్నవోయిన
వదనంబులతో మరల విష్ణుకంచి కేఁగిరి.

—: హరదత్తుఁడు తీర్థయాత్ర సలుపుట :—

క॥ హరదత్తుం డంతనె యా
హరిదంతరపుణ్యతరమ♦హాస్థలయాత్రన్
హరువుగ సల్పఁగ జననినిఁ
బరిజనులను బుధులను గొని ♦ పయనము చేసెన్॥ 83

సీ॥ ఏ పురం బొక్కమా♦ఱీక్షింపఁ జాలిన
జనులకుఁ బాపసం♦చయము సురుఁగు
ఏ పురంబున జగ♦దేకమాతృక తోడఁ
దాండవం బాడుఁ గం♦దర్పజేత
ఏ పురంబున సన్మ♦నీశాగ్రణులకు న
ధ్యాత్మోపదేశంబు♦హరుఁడొనర్చె
నే పురంబునను మ♦హేశ్వరకరుణకు
గుఱియయ్యె నుపమన్యుఁ♦డురుతపస్వి

తే-గీ॥ ఆ పురం బిల మోక్షల♦క్ష్మీపురంబు
గురుతరజ్ఞానహర్మ్యాగ్ర♦గోపురంబు
శ్రీపరాంబామహేంశాంఘ్రి♦నూపురంబు
భవ్యతరమగుశ్రీచిదం♦బరపురంబు॥ 84

తే-గీ॥ చేరి పుష్కరిణిన్ గ్రుంకి ♦ చిత్సభాప్ర
వేశ మొనరించి శ్రీతాండ♦వేశమూర్తి
నార్య కామేశ్వరినిఁ గొల్చి ♦ హస్తిముఖుని
షణ్ముఖునిని భజించి బల్♦సంతసమున॥ 85

క॥ స్ఫాటికలింగార్చనమును
నీటగుమాణిక్యమూర్తి ♦ నిరతిశయార్చన్
హాటకసభాలయము న
చ్చోటం గల దివ్యరాజిఁ ♦ జూచి ప్రియమునన్॥

తే-గీ॥ మధుర కేగి సువర్ణప♦ద్మహ్రదమున
మునుక లొనరించి సుందర♦మూలలింగ

మును శఫరనేత్రి నార్యను ♦ బూజచేసి
తక్కుపరివారదేవతా♦తతికి మ్రొక్కి॥

క॥ శ్రీరామేశ్వరధామము
నారామనృపాలకృతని♦రతిశయపుణ్య
శ్రీరమ్యహర్మ్య మర్మిలిఁ
జేరి యిటుల్ సకలతీర్థ♦జీవనతతులన్॥ 88

క॥ సేతువులో దురితహరణ
హేతువులో నుభయజలధి♦హృద్యోర్మిలస
త్పూతోదకమండలి సు
స్నాతు లయి కదున్‌గదున్ బ్ర♦శస్తహృదయులై॥

తే-గీ॥ ముందు హనుమత్ప్రతిష్ఠిత♦ముగ్ధచంద్ర
కేశు విశ్వేశుఁ దద్దేవ♦తేశురాజ్ఞిఁ
బూజనముచేసి రామేశుఁ ♦ బూజచేసి
జననిఁ బర్వతవర్ధనిఁ ♦ జక్కఁగొలిచి॥ 90

క॥ హేరంబుని షణ్ముఖునిన్
వారలవారిజముఖులను ♦ వారనిభక్తిన్
నారెకుఁగొలిచి సకలపరి
వారామరతతి భజించి ♦ వరుసగ నంతన్॥

తే-గీ॥ కదలి మాతృభూతేశ్వర♦గ్రామ మొంది
యింపుమై నమ్మహేశుఁ ద♦ద్ధృదయదేవి
సురభికుంతలమాతను ♦ సురుచిరోరు
భక్తిఁబూజించి జంబుకే♦శ్వరముఁ జేరి 92

క॥ జంబూద్రుమంబుఁ గని యఘ
జంబాలముఁ బాపునట్టి♦సర్వేశు నుమన్
బంబినభక్తి భజించి ర
యంబున శ్రీరంగపట్ట♦ మరిగిరి వేడ్కన్॥

సీ॥ వెలయు నేవీటఁ గావేరీమహానది
దక్షిణోత్తరదిశా♦ధామములను

బవళించియుండు నే ♦ పట్టణంబున భోగి
రాజతల్పంబుపై ♦ రంగభర్త
సిరితోడ ధరతోడఁ ♦ జెలగుచు విభు నెందు
నలరించు రంగతా♦యారుకరము
నివసింతు రేయూర♦నిర్మలాత్ములు వేన
వేల్ వైష్ణవోత్తముల్♦వీధులందు

తే—గీ॥ అట్టి సప్తావరణవై భ♦వాతిశయప
రీతశోభితమగు నప్పు♦రీవరంబుఁ
జేరి కావేరిజలమాడి ♦ శ్రీసనాథు
రంగనాథుని సేవించి ♦ రాణగదుర॥ 94

తే—గీ॥ అంతఁ గుంభఘోణంబున ♦ కరిగి భక్తి
గరిమఁ గుంభేశు దన్మనః♦కాంత నార్య
మంగళాంబను బూజించి ♦ పొంగెసంగ
నమరునాగేశుఁ దత్సతి ♦ నంబఁగొలిచి॥

వ॥ ఇఁక ననేకంబులగు శివలింగంబులకును దదవరోధంబులగు జగ
న్మాతలకును మ్రొక్కులిడి.

క॥ వైద్యేశ్వరపురి భవరు
గ్వైద్యేశ్వరు వేదవేద్య ♦ వైభవసుభగున్
విద్యుద్వర్ణకపర్దున్
సద్యశ్శ్రేయఃప్రదాన♦చతురు మహేశున్॥

క॥ బాలను విదలితభవజం
బాలను బాలేందుశకల♦పరిభాషితచూ
డాలను నీలమణీఘృణి
జాలను సేవించి సంత♦సం బిగురొత్తన్॥

మ॥ తిరువణ్ణామల కేఁగుదెంచి యచటన్ ♦ దేవాదిదేవున్ గృపా
కరభావున్ గలహంససూకరవరా♦కారాత్మభూహార్యగో
చరమూర్ధాంఘ్రివిరాజితోజ్జ్వలతనున్ ♦ శైలాధిరాట్కన్యకా
పరివస్యాపరితుష్టమానసు లస♦ద్భక్తైకరక్షావశున్॥

క॥ భక్తి నపీతకుచాంబా
శక్తిని నిఖిలాబ్జజాండ♦సంరక్షణకృ
ద్వ్యక్తిసఁ గృతభక్తాంహో
ముక్తిని భజియించి మిగుల ♦ ముదితాత్ముకులై ॥

వ॥ మఱియుఁ బళని తిరుత్తని తిరుశైలంబులందు సుబ్రహ్మణ్య భక్తాబ్రహ్మణ్యప్రశమను బూజించి శ్రీకాళహస్తపురిఁ జేరి సువర్ణ ముఖరీధునిఁ గోయంబులాడి జ్ఞానాంబాహృదయపుండరీకభాస్కరు శ్రీకాళహస్తీశ్వరు సేవించి యనంతరంబు శ్రీపర్వతంబుఁ జేరి యందు శిఖరాగ్రసందర్శనం బొనరించి.

సీ॥ పాతాళగంగను ♦ స్నాతులై మల్లేశు
ఫుల్లారవిందాళిఁ ♦ బూజచేసి
భ్రామరీశక్తి క♦పచితినింబొనరించి
పంచాక్షరీయంత్రి♦భస్మ మలఁది
సాక్షిగణేశుని ♦ సారంగనాథుని
హాటకేశానుని ♦ నర్చచేసి
ఆరామవీరేశ్వ♦రాంఘ్రుల సేవించి
తక్కనయట్టితీ♦ర్థముల నొంది

తే–గీ॥ త్రిపురరాక్షసహంతఁ ద♦ద్దేవదేవి
నమ్మహానందిలింగంబు ♦ నార్య గౌరి
బ్రహ్మలింగేశు జోగుళాం♦బను భజించి
వరదు హేలేశ్వరు నిఁక.ద ♦ తృప్తిఁగొలిచి॥ 102

క॥ గోకర్ణక్షేత్రముఁ జని
గోకర్ణాభరణకర్ణు ♦ గురుతరకరుణా
శ్రీకు దశాస్యసుకృతపరి
పాకశుభాకారుఁ గొలిచి ♦ పత్నీసహితుఁ॥ 103

క॥ సౌరాష్ట్రసోమనాథుని
సారకృపానిధిని భీమ♦శంకరమూర్తిఁ

ధీరు మహాబలనాయకు
భూరిపరశివైద్యనాధుఁ♦బూజించి తగన్॥

క॥ ఘుశ్మేశ్వరునిన్ దారుణ
రశ్మిబృహద్రశ్మితుహిన♦రశ్మినయనునిన్
గశ్మలహరు మునిమానస
వేశ్మచరున్ బూజచేసి♦విశ్వశరణ్యున్॥

వ॥ మఱియు ననశ్వరభోగేశ్వరు నాగేశ్వరు నర్చించి గౌతమమునీం ద్రపుణ్యాలంబకుఁ ద్ర్యంబకదేవు నారాధించి సంకటహరుల నోం కారపరమేశ్వర విమలేశ్వరులను బూజనంబొనర్చి త్రిజగజ్జేగీయ మానవైభవుం డగునుజ్జయినీమహాకాళదేవుని సేవించి యశ్రాంత విశ్రాణనకృపాళు నేపాళపశుపతిన్ భజియించి మోక్షబీజావాప కేదారుఁ గేదారదేవు నర్చనంబొనరించి నిరపాయదయాసనాధుఁ జితాభూమివైద్యనాధు నమస్యసల్పి యానందకాననంబుఁ జేరి యందు.

సీ॥ నిరవశేషితపాప♦నిర్మలాంభశ్శ్రేణి
మణికర్ణిక నొనర్చి♦మజ్జనంబు
ఔపనిషదపద♦వ్యాకృతనిజబోధు
విశ్వనాధు బ్రపత్తి♦వెలయఁగొల్చి
చేటికాభూతకు♦శేశయపాణి స
రస్వతి నన్నపూ♦ర్ణను భజించి
సర్వవిఘ్నధ్వాంత♦చండమయూఖు డుం
ఠికరీంద్రముఖుఁ దని♦యకయజించి 106

తే–గీ॥ భూరమాధవు మాధవుఁ ♦ బూజచేసి
కాలభైరవపాదయు♦గ్మమున వ్రాలి
యక్షరాజాంఘ్రివనజంబు ♦ లర్థి మ్రొక్కి
తక్కఁగలయట్టి వేల్పులం♦దఱకు నెఱఁగి॥

సీ॥ మునియప్పుఁదీర్పఁబూ♦నినహరిశ్చంద్రుండు
వెలఁది నమ్మినయట్టి♦వీధిఁ గాంచి

ఈడిగపూఁబోఁడి ♦ నెనయఁబాపఁడు మధు
కలశమొందినయట్టి♦నిలయ మరసి
పదియశ్వమేధంబు ♦ లాదవించి లింగప్ర
తిష్ఠ సల్పిననల్వ♦తెఱఁగు నెఱిఁగి
అల సుశీలయుఁ బ్రత్య♦హంబు తీర్థం బాడి
నట్టిజ్ఞానోదక♦హ్రదముఁ గాంచి

తే-గీ॥ అల్ల పన్నిద్దఱర్కులు ♦ హరువుమీఱ
హరుని సెలవొంది చెంది యు♦ప్పరమునందె
భ్రాంతులై సంచరించునై♦భవమును గని
మఱసి జోతలనర్పించి ♦ ముందు కేఁగి 108

వ॥ తీర్థరాజంబుఁ జేరి మాధవేశ్వరీమహేశ్వరులనర్చించి గయాక్షే త్రంబునఁ బితృ నర్గ్యంబులగుకృత్యంబుల నిర్వహించి మంగళ గౌరిని సమంత్రవిధినర్చనంబొనరించి భువనేశ్వరభీమేశ్వరలింగ బుల నారాధించి గౌతమీకృష్ణవేణీమహావాహినీసలిల సందోహంబుల నవగాహనంబొనరించి సంచరితనగరాస్థానంబు లందెల్ల మహే శ్వరపారమ్యనిర్ణయంబుఁ బ్రకటనంబొనర్చుచు నందందలి పాశు పతాగ్రగణ్యుల సేవించి యభినందింపుచు నందను శ్రీనీలకంఠశివా చార్యుల దేశికునిగ వరియించి తత్ప్రసాదంబుఁబడసి కతిపయదినం బుల కాత్మనివాసంబుఁ జేరి రంత హరదత్తుఁ డనన్యసామాన్య వైదుషీవిశేషభూషితుండై ప్రతిదినంబునందు సర్వదర్శనాపార పాండితీగంభీరంబులగు మహోపన్యాసంబులొసంగుచు నుత్తమ గ్రంథంబులనిబంధించుచు సర్వవేదతాత్పర్యనిర్ణయంబు సంధానించె నాపైఁ గొంతకాలంబున కాధీరపరిభాకరునకు.

—: హరదత్తుని వివాహము :—

క॥ పద్మినినిఁ బోల్పఁగలయొక
పద్మినియనుకన్యఁ దెచ్చి ♦ బహుమతమొప్పన్
విద్మణి యొకవిప్రుండు హ
రిద్మండలియలర నిడి పరిణయమొనర్చెన్॥

వ॥ పద్మినీహారదత్తులకుఁ గ్రమంబుగ నేకామేశ్వరమహాదేవశంకర నీలకంఠచంద్రశేఖరశంభుమధ్యార్జునేశ్వరులనుపుత్త్రులును గల్పక మీనాక్షులను గూఁతులును జన్మించి యభివృద్ధినొందుడుఁ బుత్త్రికలను బాత్రులగువరుల కొసఁగి యుద్వాహంబొనర్చి పుత్త్రులను వేదవేదాంగంబులఁ బారంగతుల నొనర్చె నవల నొకనాఁడా స్థానస్థలివసుమతీపతి యభ్యర్థనంబున భక్తియోగంబుమహిమంబును గూర్చి చర్చించి యుపన్యసించుచు నొక్కయైతిహ్యంబు నిట్లు ప్రతిపాదించె.

### చండకభిల్ల చరిత్రము

క॥ పాంచాలదేశమును బా
లించు నొకం డరిజనావ♦లేపహరుం డ
భ్యంచితశివలింగార్చా
చుంచుం డిలసింహకేతు♦శుభనామకుఁడై ॥

సీ॥ కలలోన నేనిఁ బర♦కాంతల మొగమును
జూడఁగాఁ దలఁపని♦సురుచిరాత్ముఁ
డాకలిఁగొనియేని ♦ యపరిశుద్ధాన్నంబు
భుజియింప నెంచని♦పుణ్యశీలుఁ
డలిగియుండియునేని ♦ యనుజీవులను గూడ
నొవ్వఁబల్కనియట్టి ♦ నుతచరిత్రుఁ
డక్కఱవడియేని ♦ యన్యధనంబుల
హరియింపఁబూనని ♦ యమలహృదయుఁ

తే-గీ॥ డలసియేనియు దేవగు♦ర్వగ్రజన్మ
ధేనుపూజల మానని♦ధీరమూర్తి
భ్రమసియేని యసజ్జన వర్గగోష్ఠిఁ
జేరనట్టి యకల్మష♦చిత్తుఁ డెపుడు॥



క॥ సముచితగతి నాతండు వ
సుమతిఁ బాలించుచుండ ♦ నుడివడి యొకఘు

స్రమునందు జానపదజా
లము దనిసి రయమున మ్రోఁతలను సల్పిరిటుల్॥ 114

మ॥ పులులున్ భల్లుకముల్ వనేభము లెనుంబోతుల్ వనీసూకరం
బులు సింగంబులు ఖడ్గసంఘములు దుప్పుల్ మున్నుగా నొప్పున
బ్బలవత్కాననజంతుసంతతులు పైపై రేగి మాగోగణం
బుల సస్యంబులఁ బొట్టఁబెట్టుకొని యేపున్ మీఱుచుండెన్ విభూ!

ఉ॥ బాలుర నంగనాతతుల ♦ భద్రముసేయుట మొక్కలంబుగాఁ
గ్రాలుచునుండె నింక నెటు ♦ గ్రామములందు మనంగనేర్తుమ
య్యా! లవ మాత్మచిత్తమున ♦ నక్కటికన్ గొని వేగ వచ్చి స
త్త్వాళినిఁ గూల్చి నీ జనుల ♦ ప్రాణములన్ బరిరక్షసేయుమా!

ఉ॥ జాగొనరింప కీవిఁకను ♦ సత్వరమే పయనంబు సేయఁగా
బాగు మఱొండుకార్యమును ♦ భావనసేయకు మా ర్తజీవర
ఈగరిమంబుఁ బోల్పఁగల ♦ చక్కటు లెందులభించు నీకు నీ
వే! గణియింపు మన్నియును ♦ సిద్ధచరిత్ర! పవిత్ర! పేర్మిమై॥

క॥ అనినంత మహీనాథుం
డనుకంపదలిర్ప వేగ ♦ నాఖేటకయో
ధనికాయమునకు జేపు గ
హానమును జేరవలె వేఁట ♦ లాడఁగ వేగన్॥ 118

—: సింహకేతుమహారాజు వేటకేగుట :—

వ॥ అని శాసించి.

తే–గీ॥ పల్లెటూరులవారి క ♦ భయముఁ జూపి
సెలవొసఁగి పంపె వారలు ♦ చేరఁబోయి
రాత్మపురముల కిచట వా ♦ హ్యాళిధీరు
లెల్లరున్ గడుహర్షంబు ♦ వెల్లివిరియ॥ 119

చ॥ బఱిసెలు బారుటీటెలును ♦ బాఁకులు బల్లెము లుక్కుకోలలున్
జిఱుగదలున్ ద్రిశూలములు ♦ సింగిణులున్ బలుతీర్లుకైదువుల్
పరశులు దుడ్డుకఱ్ఱలును ♦ బాశము లుద్ధతసారమేయముల్
విరివిగఁ గూర్చి యార్చి సర ♦ విన్ బయనంబు నొనర్చి రేపునన్॥

తే-గీ॥ విభునితోఁ గూడ నడిచిన ♦ వేఁటకాండ్ర
లోన నొక్కఁడు శబరుఁడు ♦ నూనబాహు
బలుఁడు చండకుండను పేరఁ ♦ బరఁగువాఁడు
యుద్ధభటులందుఁ గూడఁ బ్ర ♦ సిద్ధమూర్తి॥

క॥ భూతదయ దైవభక్తి మృ
షేతరవాఙ్నియతి గలిగి ♦ యెసఁగు నతఁడు వి
ద్యాతతవివేకరహితుఁడు
చాతురి యెక్కుడుగ లేని ♦ జనమాత్రుండై॥

తే-గీ॥ సైనికులలోనివాఁడయ్యు ♦ జనపతి యను
శాసనంబుననతఁడు ని ♦ శాతభల్ల
చాపశరధరుఁడై యట ♦ వీపదంబుఁ
జేరవచ్చెను వేఁటాడఁ ♦ జేవమీఱ॥ 124

ఉ॥ ఇనుఁ డుదయించునంతకె మ ♦ హీశ్వరుఁడున్ మృగయావిశారదుల్
ఘనగహనస్థలిన్ దఱిసి ♦ కాఱెనుఁబోతుల నెల్గుబంటులన్
వనకిటులన్ మదేభముల ♦ వ్యాఘ్రములన్ బహుసింహసంహతిన్
దునిమిరి గట్టులట్లువడె ♦ దుష్టమదోద్ధతసత్త్వసంతతుల్॥

క॥ ఒకరికి నొక్కరు గలియక
నికరపుబాహుబలవీర్య ♦ నిపుణతఁ దమచూ
డ్కికి ననువగుదిశ నెక్కొని
సుకరముగ వధించిరంత ♦ క్షుద్రమృగములన్॥ 126

ఉ॥ చండకభిల్లుఁడున్ గడుఁబ్ర ♦ చండభుజాతతవిక్రమోన్నతిన్
దండి యెలుంగులన్ బులుల ♦ దంతినిహంతల ఖడ్గవర్గమున్
మెండగు నేదుబందులను ♦ మీఱుచు వంచి వధించె నవ్వి పె
ల్గొండలవోలెఁ బృథ్విపయిఁ ♦ గుప్పనఁగూలె హతాహతంబులై॥

తే-గీ॥ సూదవిద్యావిశారద ♦ స్తోమమును ని
తరపరిజనంబులను గొని ♦ తఱలి వచ్చి
యొక్కకాసారరాజంబు ♦ ప్రక్కఁబటకు
టీరమును గూర్చి సర్వంబుఁ ♦ జేరిచి యట॥

క॥ పప్పన్నంబులుఁ బులుసులు
గొప్పవుఁదగినట్టియిగురు♦కూరలు చేరుల్
అప్పడములు వడియంబులు
నొప్పుగ సిద్ధంబుచేసి ♦ యుంచినయంతన్॥

వ॥ అంతకు మున్నె సంకేతంబుచేసికొనినవారలు గావున ద్వితీయ యామాంతంబువఱ కాఖేటంబుసలిపి యేకిమీఁదును బరిజనంబులును దటాకంబు సమీపించిరి.

సీ॥ ప్రబలాతపక్లాంత♦బహుళాధ్వనీనవి
తానని తాంతసం♦తాపహరము
మదకరేణుసనాథ♦మాతంగరాజమ
జ్జనకేళిశిథిలోర్మి♦సముదయంబు
నైకటస్థితమహా♦నగశిరస్థలకంద
రాంతరాళాంబుధా♦రాంచితంబు
ఘనతపోవనముని♦కాంతావగాహన
హారిద్రచూర్ణపం♦కాంకితంబు

తే-గీ॥ కాకలీకూజితాత్యంత♦గానచతుర
చక్రచక్రాంగశుకపిక♦శారికౌఘ
నైకకంఠస్వనముఖరి♦తాఖిలాశ
మరుస మిడెమధురోద మ♦బ్జాకరంబు॥ 131

వ॥ అంత.

క॥ నరపతియును బరిజనమును
బిరుదగునవ్వేఁటకాండ్రు ♦ ప్రీతిమెయి నటన్
వరుసజలమాడి జగ్ధిన్
జరిపిరి చండకుఁడు నాగ♦శబరుఁడు వెలిగా 132

క॥ అతఁ డందఱ మిగిలి కడున్
వితతభుజాశక్తి యుక్తి♦వేఁటాడి మహో
న్నతసత్వములఁ జదిపె నని
యతులితయోధుఁ డని పొగడి ♦ రందఱు వానిన్॥

## ఆశ్వాసాంతము

క॥ శతధృతికరోటమాలా
వితతోరస్స్థాన! కాద్ర♦వేయసముదయో
చితభూషణసుకపర్దా!
హతభాస్కరిగర్వ! మల్లి♦కార్జునదేవా! 134

గద్య— ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితసుకవితా భాగధేయ బుధజనవిధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయ విరచితంబైన హారదత్తవిజయకావ్యంబందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# హరదత్త విజయము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీనాథసోదరీచే
తోనళినద్యుమణిమూర్తి! దుర్వారతర
ధ్యానాభియుక్తభక్తని
ధానా! శ్రీశైలవసత ♦ తా! మల్లేశా!

వ॥ దేవా! అవధరింపుము.

—: భిల్లుఁడు శివలింగంబుఁ జేకొనుట :—

చ॥ శబరుఁడు పెక్కుసత్త్వములఁ ♦ జంపియుఁ దక్కినవానిపట్లు తా
ను బటకుటీరముఁ దఱియఁ ♦ నుంచుచునుండఁగ బ్రానిదట్టపుం
గుబురులమధ్యఁ బాడువడి ♦ కూలినపుట్టశివాలయంబు దృ
ష్టిఁబడుడు నంత లోపలికిఁ ♦ జేరి కనుంగొనె దివ్యలింగముఁ॥

వ॥ అంత నతండు.

తే-గీ॥ భిన్నపీఠపతిత మయి ♦ పృథివి నొరగి
యున్నలింగము నాత్మకీ ♦ యోరుభాగ్య
ఫలముగా నెంచి గ్రహియించి ♦ పార్థివేంద్రుఁ
డున్నపటమందిరము నుదా ♦ నొంది వేఁగ॥ 3

తే-గీ॥ విభునిఁగని మ్రొక్కి యుల్లసి ♦ ల్లి విన్నవించె
దేవ! చూడఁగదే యిది ♦ దివ్యలింగ

మనుపమము మామకీనభా♦గ్యస్వరూప
మర్చనముసేయుదుర్ దెల్పు♦మా క్రమంబు॥

క॥ కూలిన దేవళమును భువి
వ్రాలినయీలింగమును బ♦రాకునఁగని లోఁ
జాలిఁగొని తెచ్చితిని జన
పాలా! యీదీనజనునిఁ ♦ బాలింపఁగదే! 5

— భిల్లుఁడు రాజును శివపూజావిధిని జెప్పుమనుట :—

ఉ॥ మంత్రవిధిజ్ఞులై యలరు ♦ మాన్యుల పూజలఁబ్రీతుఁ డయ్యునా
మంత్రము రానియట్టియల♦మానిసులున్ గొలువంగఁ బ్రీతుఁడౌ
తంత్రము గల్గియుండు నది ♦ దంటవు నీ వెఱుఁగంగలా వికన్
మంత్రవిదగ్రణీ! తెలుపు♦మా! శివతుష్టిగ నర్చనావిధిన్॥

క॥ నీవే గురుఁడవు హరుఁడవు
నీవే యొడయఁడవు దేవ♦నిర్మలాభావా!
కావలుఁ డనిచూడకు హిత
మావిధి నుపదేశ మొసఁగు ♦ మతివేగమునన్॥

తే-గీ॥ పూర్వకర్మప్రచోదిత♦బుద్ధితోడ
లింగమును దెచ్చి చూపి య♦భంగభక్తి
నిట్లు పూజావిధిన్ గోరు♦నెఱుకుఁ గాంచి
యించుక హసించి యిట్లనె ♦ నెలమి నృపతి।

ఉ॥ ఎక్కడినుండి తెచ్చితివి ♦ యేటికి నీకిది పాడువడ్డ యూ
చక్కని నున్న యిమ్మహిత♦శాంకరలింగము ముట్టవచ్చునే
చొక్కమెఱుంగకుంటి వట♦సోఁకు తెగల్ మఱి భూతసంచయం
బెక్కుడుచేరి యుండు హిత♦మెంచి వడిన్ గుడిఁజేర్పు! లింగమున్॥

ఆ-వె॥ వెడఁగుబోయ వేడ♦విమలలింగం బేడ
సీధుపాన మేడ ♦ బోధ యేడ
వేఁటసేయు టేడ ♦ వేదపద్ధతి యేడ
వలన దుడుగు!దీన వాసి లేదు॥ 10

క॥ అనుడుఁ గటకటపడి నా
తనువుఁ బైశాచభూత♦తతు లీక భక్షిం
చిన మోదమువడుదును బా
వన మీలింగంబు నిచటఁ ♦ బాయఁగఁ జాలన్॥ 11

ఉ॥ నే నిఁక నేఁటనుండి ధర♦ణీధవ!నీదుపదంబు లానగాఁ
బూనికసేయువాఁడ మధు♦వుఁ నిఖిలామిషముఁ ద్యజించితిన్
బో నిఁక వేటసేయుట క♦పూర్వతరాత్మము దోఁచెఁ బ్రేముడిన్
బూని వచింపుమా!శివుని ♦ పూజనపావనసుప్రయోగముఁ॥

వ॥ అనిన రాజిట్లనియె.

తే-గీ॥ ఓరి! యీలింగమును గొని♦యుత్సుకతను
నీ గృహంబున కేఁగఁగా ♦ నీదువధువు
నిన్నుఁ దెగనాఁడు లింగంబు ♦ నీటఁదోఁయ్రియు
మానుమీ లింగపూజను♦మంచిదెంచి॥

క॥ సుకముగ దంపతు లెపుడు హీ
తకరాన్నసుగంధపాన♦తర్పణముల నా
త్మకు సంతసంబునిడుచు మ
నికిని గడపుటయె మేలు ♦ నీ వదిగనుమా! 14

క॥ పరమున్నదియో లేదో
భరమనకేవేవో కొన్ని ♦ పచరించి వృథా
కర మలయుదు రిట నొకకొం
దఱు నీ వాబాటఁబోకు ♦ తనియు సుఖముఁ॥ 15

క॥ అన శబరుండిట్లనె నో
జననాథ!మదీయభార్య ♦ చక్కఁగ నిఁక నా
మనమున కెదురుగనాడినఁ
బని లేదిఁకఁబొమ్మటంచుఁ ♦ బనిచెద దానిన్॥ 16

చ॥ ఒకఁడనె శర్వలింగమున ♦ కోపిక నర్చనచేసికొందుఁ దా
వక ముపదేశపద్ధతికి ♦ వార యొకించుక గల్గనీను మో

రకుఁ డనిచూడఁ బోకు మిఁక ♦ రాజశిఖామణి! యచ్చమైనమ
చ్చికఁ బరిశీతుఁ డాంగొనఁగు! ♦ శ్రీశివలింగసమర్చనావిధిన్॥ 17

వ॥ మఱియు.

తే-గీ॥ అధిప! ఆహారనిద్రాభ♦యంబులందు
మిథునభోగంబులందె నర్ ♦ మెలఁగుమనుచు
హితవు బోధించెదవయేని ♦ యెఱుకటంచు
సమ్మతమె యైన నాలింపు ♦ జడునినుడిని॥ 18

క॥ మానవుఁడె కావలయునె?
ధీనిధి! యిఁకఁ బ్రాణులెల్ల ♦ తివిరి యశనని
ద్రానిధువనభయముల నెం
తేనియునుంబడయుఁగాదె ♦ యెఱుఁగనె? వానిన్॥ 19

తే-గీ॥ పరము లేకున్నఁ బున్నెంబు ♦ పాప మెదియు
లేకయున్నను నరయంగ ♦ నీకనుపడు
జగము నందెట్టులొదవె దృ♦ష్టంబు గాఁగఁ
దారతమ్యంపుసృష్టియుఁ ♦ దదనుసృతియు॥ 20

క॥ ధేనువునున్ బూజించుట
శ్వానంబున కెంగిలిడుట ♦ చక్రాంగము న
న్మ్యానప్రీతిన్ బెనుచుట
పూనికనై వాయసమును ♦ మోదుట తాల్‌న్ 21

వ॥ సర్వజ్ఞుఁడగు నీ కెదురాడఁ గలాఁడనే మన్నించి నా కభిమతం బును బోధింపుము.

చ॥ అనుటయు వేఁడు వీఁ డెటుల♦నాడిననున్ విడువండు లింగ మ
ర్చనయెడ సుంత మానస మ♦సహ్యమునొందఁగఁ జేయుపట్లనై
నను నెటుసల్పునో యనుమ♦నంబున నిట్లు హసించుచున్ వచిం
చెను వినుమోరి! చెప్పెదను♦క్షిప్రము శాంకరపూజనంబొగిన్॥

—: భిల్లునకు రాజు శివపూజాక్రమంబుఁ జెప్పుట :—

ఉ॥ స్నానముసేయఁగావలె ను♦షస్సున మడ్గను గట్టఁగావలెన్
మేన విభూతిఁబూయవలె ♦ మేలగుచందన మక్షతంబులున్

సూనము లచ్ఛబిల్వములు ♦ శోభితగుగ్గులు ధూపదీపముల్
తేనియ చాఱపప్పులును ♦ దీయనిపండ్లను దండులాన్నముల్॥

తే-గీ॥ సిద్ధపఱచి సంకల్పంబుఁ ♦ జెప్పి శివుని
ధ్యానమొనరించి యుచితాస♦నార్ఘ్యపాద్య
విమలతీర్థాభిషేకముల్ ♦ విధిగ నొసఁగి
భసితగంధాక్షతంబు ల♦ర్పణముచేసి॥ 25

క॥ సుమముల బిల్వ మొసఁగి ధూ
పమునిడి గవ్యాజ్యదీప♦పఙ్క్తి నిలిపి య
న్నములనివేదనకుం బూ
ర్వమునన్ గలవొక్క యవస♦రవిధి యరయుమా!

తే-గీ॥ శంకరుండు చితాప్రదే♦శంబుఁ జేరి
యచటిభస్మముఁ బ్రీతిమై♦నలఁదు నెపుడు
కానఁ దద్భూతి శివునకుఁ ♦ గరముప్రియము
ముందు నైవేద్య మిదు!చితా♦భూతి నెపుడు॥ 27

ఉ॥ దానన నీవు శంకరుఁ డు♦దారతరాత్ముఁ డనుగ్రహించి స
న్మానముతోడ మోక్షము స♦మర్పణసేయఁగలండు రూఢిగాఁ
బూనికతప్పనీక యొక♦పూజనవస్తువలభ్యమైనన్
దీనిని నేమఱందగ ది♦దే కడతేర్చు నుపాధిదుఃఖముల్॥

తే-గీ॥ అవల మధురఫలము ♦ లభిమతభక్ష్యంబు
లన్నపానములను ♦ నారగింపు
చేసి విడెమునిడి సు♦వాసనాఘనముఁ గ
ర్పురమువెలుఁగుఁ బట్టి ♦ పూలువేయు!

క॥ ఆ పైన మ్రొక్కి శివునకుఁ
జూపుము నృత్తంబుపసను ♦ శోభితగతి నిం
పౌపాటఁబాడి వినుచుము
చాపలమొందక యొనర్పు ♦ శర్వార్చ యిటుల్॥ 30

వ॥ అనంతరంబునఁ దత్ప్రసాదంబు మీరనుభవింపుఁ డని యొడయండు

నుడివిన నన్నిపాదుండు నిండగునామోదంబుతో నృపునిపదంబులకు మ్రొక్కి యిట్లనియె.

క॥ గురువచనమునందొక య
క్కరమైనను దప్పనీక ♦ గడుపుదు వ్రతముల్
గురుఁడవు పరమేశ్వరుఁడవు
హరుఁడవు మామకదురద్ధ♦రాఘౌఘతులకున్ ॥ 32

వ॥ అని యభినందించి తన్నుఁ గుడువఁబిల్చువారలకు శివపూజనంబు సేయక మున్ను నాపడనని జనపతిసెలవొంది కదలి మధ్యమార్గంబుననే కొన్నితరుశాఖల లింగాచ్ఛాదనకుటీరంబునకై ఛేదించి కొని వన్యపుష్పబిల్వచందనకాష్ఠగుగ్గులంబుల సంతరించికొని చరమయామంబున నిలుఁజేరి తనకై యెదురుసూచుచున్న ప్రియురాలిం గాంచి యిట్లనియె.

మ॥ చెలువా! నిన్నును నన్ను మన్పఁగ నిటుల్ ♦ శీతాంశురేఖాసమా
కలితాపీడమనోజ్ఞలింగము వసిన్ ♦ గన్పట్టఁగాఁ దెచ్చితిన్
ఫలమంచున్ దలపోసి యస్మదుదయ♦ప్రాముఖ్యసంసిద్ధి కే
చలనంబున్ గననట్టిభావమున న♦ర్చన్ జేయ శ్రేయంబగున్॥

తే–గీ॥ అనుచు మూటవిప్పి ♦ యభవలింగముఁ జూపి
గీముకెదుట నొక్క ♦ దీముఁ గూర్చి
పీఠశిల నమర్చి ♦ భవలింగముఁ జేర్చి
తక్కు గలుగువస్తు♦తతినిఁ దెచ్చి॥ 35

—: భిల్లుఁడు శివపూజసేయుట :—

క॥ స్నాతుఁడయి సన్నికృష్టన
దీతీర్థముఁ దెచ్చి యాజ్య♦దీపం బిడి సం
ప్రీతి నిజదేశికోచిత
రీతిమెయిన్ బూజన మొన♦రించి కడువడిన్॥ 36

తే–గీ॥ తాను సతియును దత్ప్రసా♦దంబు మెసవి
శివునిముందట భజనంబు♦చేసి ప్రహర

యుగ్మమగునంతనుఁ వేగి ♦ యుగ్మలియును
నతఁడు నిద్రించి రరుణోద♦యంబుదనుక॥

తే-గీ॥ అంత వారిర్వురు ప్రబోధ♦మంది రప్పు
డెలుకు ప్రాభాతికక్రియ ♦ తెలమి సలిపి
వనమునకు నేఁగి సుకుసుమ♦బైల్వపత్ర
మధురఫలములఁ దెచ్చి యం♦మర్చె నర్చ॥ 38

క॥ తొలుతటిదినమందుననే
యొలికిఁ జని ప్రేతభూతి ♦ యురవగునొకమ్మ
త్కలశము నిండుగఁ గొని తన
నిలయమునఁ జేర్చి పూజ ♦ నిచ్చలొనర్చుఁ॥

క॥ అది లుప్తంబగునంతకె
యదనెఱిఁగి పరేతభూమి ♦ కఱిగి విభూతిఁ
బదిలంబుగఁ గొని వచ్చి త
నదుసదనముఁ జేర్చుకొను న♦నారత మతఁడుఁ॥ 40

క॥ ఆ శబరపత్నియును గడు
పేశలకారుణ్యభావ ♦ విభుచిత్తాధీ
నాశయ పెనిమిటి దెచ్చిన
శ్రీశివలింగమును బ్రేమ♦ సేయుచు నుండెఁ॥

క॥ సమరముకల్గినతటి దే
హముపై లోభంబుఁ బాసి ♦ యని కరుగుట యు
ద్యమ మొండుదక్క నితరది
నములందున నెట్టి పని యొ♦నర దాతనికిఁ॥ 42

తే-గీ॥ మాసమాసంబునకు నొక♦మాఱు తా ది
వాణమున కేగి జీతంబుఁ ♦ బడసి తెచ్చు
కొనుట యొక్కటియే యుండుఁ♦బని తనంత
నెపుడు ననితరాధీనుఁడై ♦ యెసఁగు టొప్పు॥ 43

క॥ అద్దానఁ బ్రత్యూహం
బెద్దియుఁబొసగక యె జగద♦ధీశార్చన బల్

హార్దంగ జరుగుచునుండెను
దద్దయుఁ గాలంబుగడచె ♦ దంపతుల కిలన్॥

వ॥ అర్చనారంభంబు మొదలుకొని పదిరెండువత్సరంబులైన యపుడు శబరున కేఁబదివత్సరంబులును దత్సతికి ముప్పదియైదేడులునుం డాఁటె నంత నొక్కనాఁడు.

ఉ॥ మజ్జనమాడి వచ్చి తగ♦మగ్గనుగట్టి మహేశలింగపుం
బజ్జ సమర్చ్యవస్తువుల ♦ బాగుగఁ జేర్చి కూర్చి దీప మీ
షజ్జడతన్ జితాభసిత♦సంస్మృతి లేక యజించి యంతలో
నొజ్జనుడిన్ స్మృతిన్‌బడసి ♦ యుల్కి గృహంబున బూదిలేమికిన్॥

తే-గీ॥ కలశమును గొని వేగంబు ♦ నొలికిమిట్టఁ
జేరి యందుఁ జితాభూతిఁ♦జేరెడేని
యును లభింపమి వేఱొక్క♦యూరి కాటిఁ
జేరి వెదకిన బూది చే♦కూరదయ్యె॥ 47

క॥ అంతట విస్మితుఁ డార్త
స్వాంతుండును నగుచు నికట♦సంవసథసమూ
హాంతములఁ బ్రేతభూముల
నెంతయు శోధించినను న♦దృష్టేష్టుండై॥ 48

తే-గీ॥ చరమయామమువఱకు శ్మ♦శానములను
జాల వెతకియు భస్మ మొ♦చ్చటనుగనక
ఘుట్టకుటికాప్రభాతప్ర♦కారమునను
నాత్మపురిఁ జేరి తనదుగే♦హమున కేఁగె॥ 49

క॥ తత్సతియునున్ జితాభ
స్మోత్సన్నత నరయనైతి ♦ నుచితమె యనిశూ
న్యోత్సాహయుఁ బత్యాగమ
నోత్సుకయును నగుచు ద్వార♦మొంది వసించెన్॥

తే-గీ॥ నాధుఁ డేతెంచుచుండ న♦న్నవల దవుల
నుండియే తద్వదనదైన్య ♦ మూహచేసి
భూతి సముపార్జితము గామి ♦ బుద్ధినరసి
మదిని మఱుగుచుఁ గన్గొనె ♦ మగనిమొగము॥ 51

క॥ ఆతం డుస్స్మరనుచు నట
భూతలమునఁ గూలి యశ్రుపులు రాల్పఁగ న
న్నాతుక దయితునిడగ్గఱి
యాతతదుఃఖాకులయయి యలఁదురె మిగులన్॥ 52

తే-గీ॥ అంత నాతండు ప్రియురాలి యాననంబుఁ
జూచి వగచుచు నిట్లనె శుభచరితరో
నేఁటితోఁ బూర్తిఁ జేయ్యెనా నీ వ్రతంబు
దొరక లేదెందు భసితంబు తోయజాక్షి! 53

చ॥ పురములలోనఁ బల్లెలను బొంత శ్మశానములందు భూరిజా
గరమతి శోధనమ్మొనరఁ గాంచితి భస్మము సుంత యేనియున్
దొరకకపోయె మద్రచిత దోషము కారణమై తనర్చు నే
మరణముఁ జెందెదన్ శివస మర్చనఁ బాసి మనంగ నేర్తునే?

తే-గీ॥ అనుడు నచ్చేడియయు భర్త ననుసరించి
కొంతసేపట్లు దీనయై కుంది యంత
ధైర్యమును జెంది నాథునేత్రద్వయమున
బాష్పములఁ బయ్యెదను నొత్తి పలికె నిట్లు॥ 55

ఉ॥ ఏటికి? యింతదుఃఖ మది యీ భసితంబు లభింపకున్న నా
సాటికి లడ్డువంబులో! రసాలఫలంబులో! నారికేళమో!
నేటగుపాయసోదనమొ! నేను ఘటింతు నొనర్చు మర్చ యీ
నాఁటికి జేప్రు గొలఁబయనం బొనరింపు! లభించు భస్మమున్॥

క॥ అనుటయు శబరుండిట్లనె
వనితా! గురుశాసనంబు వదలుదు నెట్లా
దిన నుడివెఁ బరికరములన్
ఘనము చితాభూతి దీనఁగను! ఫలమనుచున్॥ 57

తే-గీ॥ అట్టి పరమార్థసాధకం బైన గురుని
శాసనంబును బాయఁగఁ జాల నెపుడు
పూజనముపిడి నిముసమీ బొంది నొంద
నన్యమేటికి? సెలవిక నరయు! దయిత॥ 58

వ॥ అనుడు నమ_త్తకాశిని ప్రాణవిభునియత్యా ర్తికి వగచి తెగువతో మరలనిట్లనియె.

ఉ॥ ఏనను జింతలేదు విను ♦ మర్కట రెండువిపత్తు లీయెడన్
బ్రాణవిభూ!ఘటిల్లె సదు♦పాయము చే నొకటేని వీనిలో
మానుపఁజెల్ల దే?వ్రతము♦మానుటయొండు మఱొండు ప్రాణముల్
బోవిడు టందు నేనొకఁడు♦పోకడఁబెట్టుదు నాజ్ఞసేయుమా!

క॥ బహుకాష్ఠపరివృతాస్మ
ద్గృహమును బడవేసి యగ్నిఁ ♦ గీలుకొలిపి నే
దహనముఁజెందెదఁ బయి ని
ర్వహిల్లుఁ బూజనము నీకు ♦ భవ్యచరిత్రా! 61

క॥ దయితా_స్తమయం బాత్మ
త్యయనిభమేన్ యాగపద్య♦దారుణతరక
ష్టయుగంబున నిపు డొక్కఁడ
వియుఁగావున నెఱఁగి సెలవు♦వేగనొసఁగుమా! 62

తే-గీ॥ అనుట కతఁ డాత్మ నించుక♦హరుస మొంది
యును నిజప్రియకిట్లనె ♦ నోసి యెట్టి
భావమొందితి వాడలు తి♦ర్గసాధ
నంబుగాఁ దలపోయవో♦నాతి!మదిని॥ 63

క॥ సంతతినిఁ జెందవై తివి
యింతకు భోగములఁ దనియ ♦ వెలప్రాయము నీ
వింతటివై భాగ్యంబును
నింతివో!చెందుటకు నేమి ♦ హేతువో యెఱుఁగన్॥ 64

చ॥ మనకులమందు మాఱ్మనువు ♦ మాటికిఁ జెల్లుచునుండు నేను స
చ్చినత్రుటి నేడ్పుమాని యొక ♦ చిన్నవయస్సుగలట్టివానిఁ జే
కొని వరియించి సౌఖ్యములఁ ♦ గూర్మిల నొందఁగవచ్చు నేటి కి
ట్లనెదవు తెల్పు నీ మనము♦నందలియాశయ మిందు సుందరీ!

క॥ అనఁ జెవులుమూసికొని జ
వ్వని "శివశివశివ"యని యనె ♦ బాడియె మారి

ట్లనుచితములాడ మి మ్మే
మనుదాన విభూ! వినుము మ♦దాశయ మెల్లన్॥ 66

ఉ॥ ఎన్నఁడు నాదుతండ్రి నను ♦ నీకిడి పెండ్లియొనర్చెనో యిఁకన్
బన్నుగ నెన్నఁడీవు నను ♦ బాలనసేయుట కొందినావొ నా
పున్నెము జీవితమ్ముఁ బ్రియ♦మున్ సకలమ్మును నాఁటనుండి నే
నిన్నుగ నమ్మియున్ననను ♦ నీ విటులాడఁగఁ గూడునే విభూ!

క॥ మాఱుమనువు విటగతి మన
వారలలో నొప్పనెడల ♦ వాసించుచు సు
స్త్రీరత్నము లొప్పదు రే
ధీరమతీ! పుట్టివారుఁ♦దీయుదు రెప్పుడున్॥ 68

వ॥ ఇఁకఁ బ్రాణపరిత్యాగంబున కెట్లొడంబడితి వనెదవేని విను.

క॥ భువి సకలప్రాణులు ను
ద్భవనిధనము లొందునట్టి♦తగవేకద! యీ
యవతారము నిత్యమొకో
వివేకభావమునఁ గనఁగ ♦ వెనుకన్ ముందున్॥ 70

మ॥ క్షయమో శోషమొ సన్నిపాతమొకొ వి♦స్ఫారజ్వరంబో మహా
మయ మింకొక్కఁడొ చేరవచ్చి యయినన్ ♦మాద్యన్మహాసత్వసం
చయఘాతంబుననైనఁ బాసభృశతా♦సంప్రాప్తిచే నైన న
త్యయ మావశ్యకభావి గాదె! కనవే!♦యవ్యాజభావంబునన్॥

క॥ ఈ నాదునిధనమున నిపు
డీ నాజన్మంబు ధన్య ♦ మిఁక మత్తనుసం
ధానులు తలిదండ్రులున్
మానుగఁ గృతు లగుదు రెంతొ ♦ మది నారయుమా! 72

క॥ శివుఁ డిచ్చిన యీ తనువును
శివపూజకు విడుచు టెంతొ ♦ శ్రేయ మదియునన్
ధవున కుపకారమైనను
నవసిన్ బాగధంగఁ దగమె ♦ యద్దాని నిఁకన్॥ 73

క॥ సెలవిమ్ము వేగముగ నీ
నిలయంబును నూడఁగొట్టి ♦ నెట్టనఁ జితినిన్
సలిపి యటఁ జిచ్చునిడి ని
శ్చలమతి నీపదములొంది ♦ జ్వాలన్ బడుదున్॥

వ॥ అనంతర మొక్కొక్కగడియలో నీకు భస్మంబు సంప్రాప్తమగు నీవు మజ్జనంబునొంది నిష్ప్రత్యూహంబుగ శివారాధనన్ జేసికొందు వనిన నన్నిపాదుండు శివపూజాభంగంబునకోపక యనుమతిఁ జూపె నంత.

తే-గీ॥ ఆ చ్చెలువ యిమ్ముఁబడఁద్రోఁచి ♦ యందుఁగల్గు
నిర్మముల నెల్ల సెడఁబేర్చి ♦ యింగలమును
జేర్చి జలమాడి మడిఁగట్టి ♦ సిందురమును
బసము కుంకుమ లొంది పు♦ష్పములఁ జుట్టి॥ 76

క॥ పతి యడుగులఁబడి యగ్నికి
నతిభక్తి ప్రదక్షిణంబు ♦ లమరించి మదిన్
శితికంఠు భక్తవత్సలు
హితమతియై సంస్మరించి ♦ యిట్లు భజించెన్॥ 77

చ॥ విరులు మదింద్రియంబు లగు♦విస్ఫురితాగరుధూపమా నొడల్
స్థిరహృదయంబగున్ స్తిమిత♦దీపము ప్రాణములున్ హవిస్సులౌ
కరణములౌ నవాక్షతని♦కాయము జీవుఁ డిఁకర్చనాఫలం
బరుదుగనొత వత్సలత♦రాత్మ! యుమాహృదయానురంజనా!

ఉ॥ ఒల్లను భోగభాగ్యముల ♦ నొల్లను నాకసుఖాలయంబు లే
నొల్లను బారమేష్ఠ్యపద ♦ మొక్కటిఁగోరెద దేవదేవ! నా
కల్లదియిమ్ము! జన్మముల ♦ నందెదనేనియుఁ దావకాంఘ్రిసం
ఫుల్లసుగంధపద్మరస♦భోజనభాజనభృంగి నౌదు తన్॥ 79

ఉ॥ జన్మము లెన్నివందలను ♦ సంతనచేసిన సంతసంబె య
జ్జన్మమునందు నజ్ఞతకు ♦ సాధకమౌ నల మాయనీకు మ
స్మన్మనమందు నింక నిము♦సంబయినన్ భవదంఘ్రిపద్మసే
వ న్మఱువంగనీకుము శి♦వా! కరుణాకర! నీకు మ్రొక్కెదన్॥

తే-గీ॥ అని రయంబున నాసతి ♦ యగ్గి దూఁకె
బాడబాగ్నులఁ బడుహిమ♦భాను భాతి
చండదహనార్చు లంతనే ♦ సమధికగతి
నెగసి తత్తనువును గాల్చె ♦ నెసఁగె బూది॥ 81

తే-గీ॥ శబరుఁ డంత భస్మంబునుఁజక్కఁబడసి
కొన్నివత్సరములదాఁకఁ ♦ గొదవ లేక
పూజ జరుగంగఁగల దని♦మురిసె భార్య
కై యొకింతేని వగపును ♦ గాంచఁడయ్యె॥

క॥ జలమాడి మడుగుఁగొని భసి
తలేపమును జెంది దగ్ధ♦ధామముకడ న
గ్గలముగ శివలింగార్చన
సలిపి ప్రసాదంబునొంది ♦ సంతోసమునన్॥ 83

తే-గీ॥ భార్య దాహంబునొందుట ♦ భావమందు
మఱచి శంభుప్రసాద మా♦మగువ కొసఁగ
నెడమదిశఁ గన దోసిలిఁ♦బడసి యూఁకె
నిలిచె నిర్మాల్యమిడె భర్త ♦ నెలఁత మెసవె॥ 84

వ॥ అంతనె యతండు జ్ఞప్తినొంది.

సీ॥ అగ్గిలోఁ బడి బూది♦యైనను దిరుగఁ బూ
ర్ణావయవములతోఁ♦నమరుదాని
సెకపుటం బేసి తీ♦సినపైడితీవె నా
ధగధగద్ధగలతోఁ ♦ దనరుదాని
అలఁత నిట్టూర్పు సుం♦తైనను జెందక
చిఱునవ్వుమొగముతోఁ♦జెలఁగుదాని
తనసతిఁజూచిత♦త్తనువునాపాదమ
స్తంబుఁబరీక్షించి ♦ చాలవిస్మ

తే-గీ॥ తుం డయి గృహంబుదెసఁ జూచు♦తోడ నద్ది
యును యథాపూర్వముగ నట ♦ నుంటఁ జూచి

మఱియు నక్కజపడి తన♦మగువను గని
యడిగె నివ్విధముగ సంశ♦యాళుఁ డగుచు॥

క॥ ఎవ్వతెవు నీవు మద్గృహ
మెవ్వాంఛఁ జేసి చేరి ♦ తిపుడేకద నా
పువ్వుంబోఁడి చితిఁ బడి
యివ్విధి బూదియయి మిగిలె ♦ నెంతయుఁగనుమా!

క॥ అకట పిశాచివా! కాక మ
లోకమాయాభామినివా! మ♦మద్ధతపైత్యా
త్మికవిభ్రాంతియొ! స్వప్నమొ!
యపటిలమతితో వచింపు ♦ మంతయు వేగన్॥ 87

తే-గీ॥ పారదారజభవమునఁ ♦ బడెడువాఁడ
నుచును దలపోసి తేసియు ♦ ను విను మట్టి
లౌల్య శైథిల్య మార్గావ♦లంబనుండు
కాఁ డెఱుకు పాయు మతనువై♦కల్య మింతి! 88

క॥ అన నల్లననగి యమ్మా
నిని యిట్లు వచించె నాథ♦నీ వనునది యొ
ల్లను గల్ల నిజము నీప
త్నినె నే మరణింపలేదు ♦ నీ వదిగనుమా! 89

క॥ ఎపుడు భవదాజ్ఞఁగొని నేఁ
గృహపీటజాగ్నినిఁ బడితినా ♦ కించిచ్ఛ్రమ లే
కపుడందు నిదురనొందితి
నిపుడిటువచ్చితిఁ బ్రసాద ♦ మిందుఁ గుడువఁగాన్॥ 90

తే-గీ॥ అనిన గృహమును బడఁద్రోచి ♦ యగ్గినిడిన
యట్టిదాన వీవేకదా ♦ యావసథము
తొల్లియు ట్లుండెఁగను మనా ♦ నెల్లఁగలదుఁ
జూచి యాయమ మదిని బల్♦చోద్యమందె। 91

తే-గీ॥ వనచరకులీనుఁ డప్డు పూ♦ర్వమున జరిగి
నట్టివృత్తంబులాను వై♦యాత్యమొప్ప

నడిగి యాయమచే సత్యమరసి మురిసి
బాడవిస్మయకలితవై ♦ వశ్యుఁ డయ్యె॥ 92

తే-గీ॥ అంత వారిర్వురు యథార్థ ♦ మరసి సర్వ
మది శివానుగ్రహవిశేష ♦ మనుచుఁ దెలిసి
భక్తిపరవశులై కృపా♦పరుని హరుని
సన్నుతింపుచు నిట్లు హా♦ర్ష మున ననిరి॥ 93

క॥ చిత్రింబులు గడుపరమప
విత్రంబులు శైలజాత్మ♦విభులీలాచా
రిత్రంబులు సకలజగ
న్మిత్రంబులు గాఁగ నెగడు♦మీఱుచు నెందున్॥ 94

క॥ పావనములు సర్వసుధీ
సేవనములు దుఃఖరోగ♦శిథిలితజనతా
జీవనములు పీయూషో
ద్భావనములు పరమహర్ష ♦భరజనకంబుల్॥ 95

వ॥ ఇ ట్లభినందించి భక్తిరసానందవాహినిన్ జొక్కియున్నంత.

—: భిల్లదంపతులుఁ కైలాసము జేరుట :—

క॥ ఆ లోననె వారిర్వురి
మ్రోల విమానంబు రత్న♦పుంజమయము పు
ష్పాలంకృతమ్మొక్కటిం దుడు
పాలశతవిభాస్వరంబు ♦ వ్రాలె నమరికన్॥ 97

తే-గీ॥ అందు నల్వురు వామదే♦వానుచరులు
ఘనులు రాజకిరీటసం♦కాశు లపుడు
వెలువడి నిషాదయుగ్మమున్ ♦ గలయఁ జూచి
యిట్లు పల్కిరి సంబరం ♦ బినుమడింప॥ 98

క॥ మీకొఱకై శంకరుఁడును
శ్రీకరుణామృతమయాబ్ధి ♦ శివయును బ్రమథా

నీక యెదురుసూచుచు మ
మ్మో్మకరణిఁ బంపి రెక్కుఁ♦డీప్రుష్పకముఁ॥ 99

తే-గీ॥ అనుచు వారల స్పృశియింప ♦ నప్డు వారు
శర్వసారూప్యమొందిరి ♦ శంభుభటులు
వారల విమానమునఁజేర్చి ♦ పరమశివుని
సముఖమును జేర్చఁగని వారి ♦ శంకరుండు॥ 100

ఆ-వె॥ ఓనిషాద! నాదు♦నురము నాలింగింపు
మనియె శివయునుఁ ♦దదాత్మసతిని
నాళి!రావె కంఠ♦మాశ్లేషమునొనర్పు
మనుచుఁ బలికె మేదు♦రాదరమున॥ 101

వ॥ భక్తినిట్లు మీాయట్లొందినవారలరుదు సంతతం బిందు వరివస్య లొనరించుచు సమతుంబున నుండుఁ డని నియోగించి వారిసేవలఁ బరమేశ్వరులు పరితుష్టులగుచుండి రిట్లు శబరుండు నికృష్టకుల జాతుండైనను భక్తి చేసి పారమేశ్వరపదంబు నొందె.

—: భక్తిమాహాత్మ్య బోధోప సంహారము :—

చ॥ సకలజనోత్తమం బయిన ♦ జన్మము నొందిన నేమికల్గు వై
దికఘనశాస్త్రసంతతులఁ ♦ దెల్విఁ బఠించిన నేమికల్గుఁ బా
యక యెవఁ డంతరంగమునఁ ♦ బాశుపతాయతభక్తి నొందునో
రకమగునట్టివాని సరి ♦ రారు జగత్త్రియ మందునెవ్వరుఁ॥

ఉ॥ కావున సర్వమార్గముల ♦ కన్నను భక్తినె పెంపుసేయుఁడీ
భావములందు నెల్లపుడు ♦ భక్తనిధానునిఁ బార్వతీపతిఁ
బావనతేజుఁ గొల్వుఁ డిఁక ♦ బార్థివముఖ్య!పరాత్పరుండు మో
దావహుఁడై మిముఁ మనుచు♦నక్కట దుఃఖము లంటకుండఁగఁ॥నా

తే-గీ॥ భక్తి యనఁ బ్రేమ విశ్వాస♦భరిత మద్ది
దైవగురుతీర్థమంత్రౌష♦ధముల యందు
నెట్టిభావంబు జనుఁ డొందు ♦ నట్టిఫలము
నొందును జగాన లే దిందు ♦ సందియంబు॥ 105

కం॥ అని యుపదేశించి మహా
ఘనుఁ డాతఁ డనేకమనుజ♦కాండమునకు దీ
క్షను నొసఁగి వసుంధరలో
ననుపమగతి శైవమతము♦నలరఁ జేసెఁ॥ 106

శా॥ అంతన్ గొన్ని దినంబులైన తఱి న♦య్యార్యాచార్యుఁ గన్నమ్మ దా
సుంతై యొప్పుజ్వరంబునన్ దనువు ని♦చ్చోఁ బాసి స్వర్గంగయై
కాంతున్ శంకరుఁ జెంది మోదవడె లో♦క స్తుత్యుఁ డాచార్యుఁడున్
జింతన్ జెందక యౌర్ధ్వదైహికముల్ ♦ జేసెన్ విధానాకృతిన్॥

—: హారదత్తుఁడు గ్రామవృద్ధులతో కైలాసంబున కేగుట :—

వ॥ ఆపైఁ గొంతకాలంబు చనినంత నొక్కనాఁ డాచార్యుండు శివ
లింగార్చనన్ బొనరించుచుఁ గైలాసయాత్రసల్పుదు నని గ్రామస్థ
జనుల కెఱింగించి నంతనవ్వారిలో స్థవిరులగువా రెల్లరును దమతో
డనే వచ్చెదము దమ్ముఁ బాయలేమని ప్రార్థించుడు నాచార్యుం
డపుడు శివానుగ్రహంబుతోఁ గైలాసంబునుండి యొకపుష్పకం
బుఁ దెప్పించి యందఱ నందు నారోహింపఁజేసి తాను సంతా
నంబు నాశీర్వదించి పత్నీసహాయుండై పుష్పకంబెక్కిన నెల్లర
కపుడు మానుషదేహంబులు మాఱి దివ్యదేహంబు లమరె హార
దత్తాచార్యుండును యథాపూర్వంబుగ మహాకాలగణేశ్వరుండ
గుచుఁ దత్సతి తత్సతియయ్యె ననంతరం బందఱితో.

ఆ-వె॥ ఆద్యచరితుఁడైన♦హారదత్తుఁ డిట్టుల
పౌషమాసశుద్ధ♦పంచమీక
విదినమందుఁ బ్రణవ♦విజయధ్వనులతోడ
శివపదంబుఁ జెందె ♦ శిష్టు లలర॥ 109

వ॥ పరమేశ్వరుండును వచ్చినవారి కందఱ కందు స్థానంబులొసంగి
మహాకాళిన్ బ్రీతిచేసి పూర్వపదంబొసంగె నాసమయంబు నం
దొక్కవృద్ధా గన గణపత్యర్చనకై శివాలయంబున కరిగియున్న
కతన నాయమమాత్ర మావిమానంబెక్క చనక యుండుట నారసి

గణేశుం డామెకు దివ్యదేహంబిచ్చి దివ్యయానంబుతో నీశ్వరుఁ జేరఁబంపుడు నాయమయు నందుఁజేరి సుఖంబుండె.

## —: ఫలశ్రుతి :—

క॥ ఈ గురుచరితము నెవ్వఁడు
బాగుగఁ జదివినిన విన్న ♦ భర్గుఁడు ప్రీతిన్
భోగము మోక్షమువారికిఁ
దాఁగూర్చును సందియంబు ♦ తగ దీయెడలన్॥ 111

క॥ జయ మగు మల్లేశ్వరునకు
జయమగు భ్రామరికి భక్త♦జనరక్షణికిన్
జయమగు గజముఖగుహులకు
జయమగు వీరేశ్వరునకు ♦ శాశ్వతము రహిన్॥ 112

క॥ మందాకినీధునికినిన్
నందికిఁ జండీశునకును ♦ నానాగణరా
డ్బృందమునకు త్రిశిఖమునకు.
నిందుకలకు శేషునకును♦ నెసఁగు జయంబుల్॥ 113

క॥ శ్రీపర్వతరాజమునకు
నాపాతాళధునికిన్ మ♦హావిక్రాంతం
బౌపాశుపతాస్త్రమునకు
శ్రీపాశుపతులకు విజయ♦సిద్ధు లెసఁగుతన్॥ 114

## —: శ్రీమల్లేశ్వర ప్రార్థన :—

క॥ నీ కిచ్చితి మల్లేశ్వర!
యీకావ్యకుమారి నెంతొ♦యింపుగ దీనిన్
జేకొని పాలింపుము కృప
నాకైరవబాంధవోడు♦హారిదశ్వముగాన్॥ 115

క॥ ఇది నిర్దుష్టయు గుణవతి
మృదులయు లలితయును గడుస♦మీచీనార్థా

స్పదయును విదుషియు నయి తగ
సదయాత్మా! యేలుకొనుము♦సంతతము రహిం॥ 116

ఆశ్వాసాంతము.

క॥ కమలాప్తకమలశాత్రవ
కమలోద్భవదివ్యనయన♦కమలత్రయ! యు
త్తమచామీకరవిగ్రహ
రమణీయ! శ్రీగిరీంద్ర♦రాజ్యాధీశా! 117

క॥ వికటవిశంకటపాటల
చికురజటాజూటకలిత♦శీతద్యుతిశా
బక! వికలితరావణదో
ర్నికరమదాతిశయ! పుణ్య♦నిధి! మల్లేశా! 118

వసంతతిలకావృత్తము॥ యోగీంద్రమానసప♦యోరుహరత్నకోశ
శ్రీగేహజాగరవి♦శిష్టతరాత్మమూర్తీ!
రాగవ్యధామయని♦రంతరఖిన్నజంతూ
ద్వేగప్రమాపణసు♦తీక్ష్ణపవిత్రనామా! 119

గద్య— ఇది శ్రీమదుమామహేశ్వరకరుణాప్రసాదితసుకవితా భాగధేయ బుధజనవిధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయ విరచితంబైన హారదత్తవిజయకావ్యం బందుఁ బంచమాశ్వాసము సర్వము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# హరదత్త విజయము

## శ్రీ మంత్రి రాఘవ కవి విరచితము

ఆర్యావృత్తములు

శ్లో॥ గజరాజరాజవదనం । కరుణానిధి మీశ్వరాత్మజం వందే
యన్నామస్మృతిమాత్రాత్ । సద్య శ్శాంతిం ప్రయాంతి ప్రత్యూహాః॥
శైవమతావనహేతో । శ్శివశాసనసంప్రచోదితో ఖ్యాతః
గణరాట్ స మహాకాలో । కైలాసా న్నిర్గతోఽనివార్యరయః॥
కాంచీపట్టణనివస । చ్ఛ్రీవైష్ణవవిప్రసూరిజాతాయాః
పూతాయాః కన్యాశ్చ । గ్గతభర్తు ర్గర్భమాప శివయోగాత్॥
అంతర్వత్నీ మథ తాం । వీక్ష్య వితంతుం స్వకీయకులముఖ్యాః
ప్రసభ మతిధర్షయిత్వా । క్రోధవశా ద్గేహతో బహిశ్చక్రుః॥
తద్భువనపశ్చిమాశా।పశుక్రోష్టే. సావధూ ర్యథాభీరీ
స్ఫుటమతి రనఘా స్థైర్యా।దువాస పరమేశ్వరాధిగతభావా॥
పరిపక్వగర్భభారా । రజనీమధ్యేఽ జభేచ కస్మింశ్చిత్
పంచగ్రహోచ్చకాలే । సుషువే సా పుత్రి మీశసంకాశం॥
బాలో బాలేందురివా । హ్లాదకర శ్శ్రీకరశ్చ మాతృముఖం
పరివర్ధితతను రాసీ । త్పంచాబ్ద ష్షోడశాబ్దమూర్తి రివ॥
అనితరసామాన్యచ్ఛవి । మనఘం స్వకుమార మీక్ష్య సా సాధ్వీ
హారదత్త స్యాత్మశిశో। ర్హరదత్తాహ్వాయ మనుమతమం చక్రే॥
నవయస్సైక స్తాకై స్సో।క్రీడాలోలై స్స్వయ మపాకృష్టః
కులటాసుత ఇతి శప్త।స్త్యక్త్వా తాః మాతరం సమాగచ్ఛత్॥ 9

బ్రూహి జనయిత్రి! కస్తే । నాథో జనకశ్చ మామక స్సత్యం
నోచేత్త్వామిహ హత్వా । తథా మరిష్యేఽహమపి భృశం వేగాత్॥

మాభైషీస్త్వమపాపే । పథి సంచారస్తవ ప్రసూర్భవ్యః
పక్షాంతరే భవతి యద్భావ్య మలం సంశయాయ వద! తూర్ణం॥ 11

ఇతి తనుజేన పృష్టా । స్పష్టం ప్రోవాచ సుచరితాఽ చకితా
తావకజనక శ్శర్వ । స్సర్వజగన్నాథ ఏవ మన్నాథః॥ 12

(బాలః)తస్యాంబ! కుత్రవాసః-(మాతా)శివకంచ్యాం భర్మహర్మ్యభవనేంతః
(బాలః)సహచరవర్యాః కే తే-(మాతా)కమలజకమలాక్షముఖమరున్నాథాః॥

తర్హి సమాగచ్ఛ! త్వం । గచ్ఛామ్యహ మావసామి పితురంకే
క్షణమిహ నస్థాస్యేహం । బాఢమితీదం సముచ్చరన్ ప్రయయౌ॥

తన్మార్గ మీక్షతీ సా । తమనుయయౌ వాసభూమి ముత్సృజ్య
ధావతి పురః కుమారో । అనుధావత్యంబికాపి తం పశ్చాత్॥

బాల స్తతో జగామాఽ । యతనం దేవస్య చైకచూతవిభోః
త మనుజగామ తదంబా । వత్స మనుసృత్య ధేనురివ వేగాత్॥

తత్సమయే శశిమౌళే । ర్గర్భగృహద్వారమాస్థితం బంధైః
పరిసమీక్ష్య ముష్టిఘాతై । ర్బాలో భిత్త్వా వివేశ తద్గేహం॥

పశ్చాన్మాతు స్తస్య । ప్రవేశసమయే కవాటయో ర్బంధః
పునర ప్యభూత్సుశిలా । సాఽర్తా విలలాప వీక్ష్య భృశ ముచ్చైః॥
దశపంచవిఘటికాంతిమకాలే బాలో నవోపవీతేన
భసితాక్షశర్వలింగై । రంచితతను రాజగామ తద్స్థానం॥

అభివీక్ష్య తనయ మారాత్ ।సుచరిత్రాఽతీవ హర్షితా పుత్రం
వక్షసి నీత్వా వక్త్రం । చుచుంబ బహువార మున్నతప్రీత్యా॥
అథ సో జననీం నత్వా । కృతముపయనం శివేన జనకేన
శివలింగధారణంచా । నివేదయ ద్దత్తమఖిలవేదచయం॥

బాలస్యచ తన్మాతు । ర్వృత్తం సర్వం విచిత్ర మభివీక్ష్య
తత్రత్యా స్సర్వజనాః । ముదమాపు ర్గాఢవిస్మితాత్మానః॥ 22

సద్య స్సర్వే తే త్వద్బాలం_చాంబా మతీవప్రసృత్య
సర్వవిఘ్నై ర్ధ్వస్తా । నత్యంతంప్రీతితో బహుధాకుర్యుః॥ 29

స్వాయ మథ తదు త్తరేహాని । హారదత్త శ్చోళభూమిపాలాయ
రచయిత్వై కాం లేఖాం । వాదార్థ మరేణ ప్రేషయామాస॥ 30

ఆవాహాయ చోళవిభో । గోష్ఠీమధికృత్య పాంచరాత్రబుధాన్
శివఏవ తత్త్వమితి తాన్ । విజయిష్యే తత్పథం హరిష్యేఽహం॥
సిద్ధే మామకవిజయే । భూయా స్త్వం క్షిప్రమేవ పాశుపతః
పక్షాంతరే మదీయం । మస్తం విచ్ఛేద యాఽసినా సద్యః॥ 32

ఇతి పత్రికాం మహీభృ న్నికట మగమయ త్తదా కుమారో సౌ
చోళేశ స్తాం దృష్ట్వా । క్షణమపి జ్ఞాత్వాఽద్భుతమతిం ప్రాప॥ 33

శ్వో విధధాస్వే విద్వద్గోష్ఠీ మాగచ్ఛ నియతమంగ! ఇతి
దత్వోత్తర మతివేగా । ద్వైష్ణవముఖ్యా నచోదయ ద్ధీరాన్॥ 34

ఉషసి పరేద్యు ర్వత్సో । విరచితశివలింగపూజనావసరః
లబ్ధ్వాఽ శివ మంబాయాః । ఆస్థానీ మావిశ న్మహీభర్తుః॥ 35

తత్పూర్వమేవ రాజ్ఞా । నీతా జేతార ఏవ గోష్ఠీషు
ప్రతివాదిభీకరాద్యాః । శ్రీవైష్ణవపండితా స్సమాజస్య॥ 36

హారదత్తోఽపి హి సమితిం । ప్రాప్య శ్రీవైష్ణవాభిముఖపీఠే
ఆరుహ్య దేవదేవం । హృదయే సస్మార శివ ముమానాథం॥ 37

ప్రతిపక్షా బహవ స్తే । బహువిధ మాచక్రిరే వివాదనదం
నిపుణమతి స్తరదత్తః ఖండన మకరో త్తదీయవాదతతేః॥ 38

పున రేకైకం నీత్వా । వేదశిఖానిర్ణయప్రమాణశతైః
శివ ఏవ తత్త్వమితి విజ్ఞానాం స్పష్టీచకార రాజాగ్రే॥ 39

ముగ్ధా స్సంత స్సర్వే । వైష్ణవకులజా నృపాలకం ప్రోచుః
శుద్ధోఽస్మదీయవాదః । జితా వయం బాలకేన జాలేన 40

జ్ఞాత్వేత త్సర్వం భూపతి రధికం మనసి చింతయామాస
విజితా వైష్ణవధీరా । స్సత్య మపీదం త్యజంతి నచ శార్వం॥ 41

ఇతి చింతాయుతమనసం । హారదత్తో వీక్ష్య భూపతిం ప్రాహ

నిశ్రేణిం జ్వలదగ్నిం । ఆయస మేకోత్తరశతసోపానం॥ 42
ఏకామ్రనాథగోపుర । మగ్నిసంస్థాపయ విధాయాహ మతివేగాత్
ఆరోహయామి తత్త్వం । శివ ఏవేతి బ్రువన్ పుర స్తేషాం
కారయ నైరపిచ తథా । కుర్యుర్యది మామకీనశీర్ష మరం
విచ్ఛేదయ నిజఖడ్గా । దన్యైః కోలాహలైశ్చ కిమనేకైః॥ 43

హరదత్తస్య వచ స్తాచ్ఛ్రుత్వా పూర్వంచ విస్మయం గత్వా
రచయిత్వా నిశ్రేణిం । తథాఽకార్షీజ్జనసమక్షు మగ్నినేతా॥ 44

హరదత్తో ప్యతివేగా । దుచ్చైః శ్శివఏవ కారణం జగతాం
ఇతి బాఢ మానదన్ తా మారుహ్య వివేశ గోపురస్యాగ్రం॥ 45

భీతాః పలాయనం తే । చక్రు శ్శ్రీవైష్ణవో త్తమా స్సర్వే
పరిశిష్టా స్సకలజనాః । హరదత్తా యోన్నతం నమశ్చక్రుః॥ 46

భూమీశప్రార్థనయా । హరదత్త స్సో యథారురోహ తథా
దృఢ మవరురోహ తస్మై । భూమిపతి ర్దండవ న్ననామ బహు॥ 47

హరదత్త స్యాంఘ్రియుగే । నిజఫాలం సన్నివేశ్య భూమిపతిః
ద్రాఘీయస్యాఽర్ధనయా । శివలింగధృతిం సమగ్రహీ త్సద్యః॥ 48

గురవే స బహుద్రవ్యం । దత్వాఽతతవ త్తువాహనం హార్మ్యం
దూరగతశైవవిబుధా నక' దావాహ్య ధర్మనిర్ణిక్షాన్
ప్రస్వా సాక మథాసౌ । శైవబుధైః పరిచరైశ్చ సహితస్సన్
ఆసేతుహిమనగాంతం । యాత్రా మకరో త్పవిత్రతీర్థవశేః॥ 49

ఏకత్రచ తత్సమయే । శైవాగమజాలపారదృశ్వానం
శ్రీనీలకంఠవిబుధం । దేశిక మధిగమ్య తత్ప్రసాద మిలాభాత్॥ 50

తైర్థికయాంత్రాచరణే । విద్యాస్థానేషు సర్వనగరేషు
శివ ఏవ కేవల ఇతి తత్త్వం సంసత్సు సంవిదాంచక్రే
ఆగత్య తతో నగరీం । కాంచీ మధిపేన సత్కృతః ప్రీతః
ప్రత్యహ మామ్నాయశిఖాలంకారం శర్వ మావద న్నాస్తే
భూమిపతే రనుమత్యా । శుభేఽహని ప్రముఖబాడబః కశ్చిత్
హరదత్తాయ స్వసుతాం । అనురూపగుణాం దదౌ వివాహవిధౌ॥ 51

అచిరాదేవ కుమారాః । కుమారికా స్తస్య చాత్మసమభాసః

తస్యాం జాతా నీతాః । వృద్ధిం సర్వాక్షిపర్వసంధానాః॥ 52
అనురూపేభ్యః పుంభ్యః । కన్యాశ్చాలంకృతా దత్వా
ఉపయమ మకరో ద్బహుతర।పరిబర్హేణాఽఽత్మగౌరవోన్నత్యా॥
పుత్రో నామ్నా యశశ్శిఖా।విద్యాపూర్ణాన్ విధాయ సత్కన్యాః
మాన్యా రూపగుణాఢ్యా । మయోజయత్ పాణిపీడనేన సుధీః
నీత్వా కతిపయకాల । మేవం సోఽథాఽబ్రవీ న్మహీంభర్త్రీ
సంస్థాప్య పత్య మిహాశ్వః కైలాసాచలం గమిష్యామః
శివభక్తి మాదధానో । భవాన్ మహీం పాలయతు చిరం సుధియా॥
ఆవాహయామి వేగా । దీశపదప్రాపకం విమాన మితః॥ 54

ఇత్యాభాష్య పరస్తా । దహాని ధ్యానేన శర్వ మాత్మగురుం
విజ్ఞాప్య తత్ప్రసాదా । దానయ దాకాశయాన మతిరుచిరం
పుత్రీః పుత్రాన్ బంధూన్ । సర్వానపిసాంత్వయన్ భృశం ప్రీత్యా
జనయిత్ర్యాచ సదారో । సమారురోహాఽన్తరీక్షగతి మనఘం
స్థవిరాః కాంచీవాసాః । సర్వే హారదత్త మంజలింకృత్వా
తదనుజ్ఞా మధిగమ్య । స్మరంత ఈశం తదారురోహు రహో॥ 55

పుష్పైః శ్రీఫలపత్రైః । రత్నై ర్ముక్తాఫలైశ్చ బహులవిధం
అర్చిత మంబరయానం । జగామ వేగేన శంభుపద ముచ్చైః
ఆగత్య చరణనికటే । పతితాన్ హారదత్త మంబికాం తస్య
పత్నీం చాన్యజనాన్ తాన్ । శర్వ స్స్వానదశేనయత్ ప్రేమ్ణా
శివసందర్శనమాత్రాత్ । హారదత్తస్య పరిపూరధిక వేగాత్॥ 58

గంగామూర్తిం లబ్ధ్వా । హారమౌళిం ప్రాప్య మోద మధిగచ్ఛత్
శంభుప్రసాదయోగా । ద్ధరదత్తో జాయయా సమేతస్సన్
ఆప మహాకాళపదం । ప్రమథామరవంద్యమాన మసమానం
హారదత్తస్య హి చరితం । శివభక్తే ర్జనక మద్భుతం చేదం
శ్రుత్వా జనః పఠిత్వా । శివప్రసాదం ప్రయాతి భూరిముదం
ఔద్భటమంత్రారాధ్యో । హారదత్తాచార్యదివ్యచరిత మిదం
విరచయ దార్యారమణాసక్తానాం । ప్రీతయే సుభక్తానాం॥ .61

శ్రీపార్వతీపరమేశ్వరార్పణమస్తు - శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారిచే రచింపఁబడిన గ్రంథములు.

---

## 1 శివపురాణము పద్యకావ్యము.

ఇందు పదకొండు ఖండములు గలవు. సుమారు 6 వేల పద్యము లుండును. శివకల్యాణము, శివలీలలు, జ్యోతిర్లింగోత్పత్తి, తన్మాహాత్మ్యములు, ఆసేతుహిమాచలాంత శివలింగ తీర్థాదులగణనము, శివతత్త్వనిరూపణము మున్నగునవి మృదులలిత శైలి వ్రాయఁబడినవి శివతత్త్వముఁ దెలియఁగోరినవారికిది చాల ముఖ్యమగు గ్రంథము.

**వెల రు॥ 10-0-0 బీజి.**

## 2 సుభద్రా కళ్యాణము.

ఇది నవరసభరితమగు శృంగార నాటకము, మదరాసు విశ్వవిద్యాలయమువారు 3 సంవత్సరములు విద్వాన్ పరీక్షకుఁ బఠనీయముగఁ జేర్చుకొనిరి. చదువుటకుఁగూడ ఆనందకరము.

**వెల రు॥ 1-4-0 బీజి.**

వలయువారు:—

# శ్రీరామాబుక్కుడిపో,
## బుక్ సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్,
### శికింద్రాబాద్. (దక్కన్)

(అని వ్రాయుడు)